# ఆంధ్రుల నాట్యకళ

భరతకళా ప్రపూర్ణ

**నటరాజ రామకృష్ణ**

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున ప్రచురితము

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

ప్రచురణ నెం. 24
ఏప్రిల్, 1975

ముద్రణ :
నాట్యకళ ప్రెస్
హైదరాబాదు-500004.



వెల : రెండు రూపాయలు

ముఖపత్రం : వరుధ శ్రీనివాసశర్మ

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ
కళాభవన్, హైదరాబాదు-500004

# పరిచయము

ఇరువై శతాబ్దాల తెలుగు చరిత్ర సంస్కృతి పునాదులపైన నిర్మింప బడ్డ తెలుగు జాతి సమైక్యతను సర్వతోముఖాభివృద్ధిని పటిష్ఠం చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధ్వర్యంలో రాక్షసనామ సంవత్సర ఉగాది (1975 ఏప్రిల్ 12వ తేదీ) నుండి వారం రోజులపాటు ప్రపంచ తెలుగు మహాసభలు జరుగుతున్నవి. ఈ మహాసభల ఏర్పాట్లకుగాను ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు అధ్యక్షులుగాను, విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణరావుగారు నిర్వాహకాధ్యక్షులుగాను ఒక సంఘం ఏర్పడింది. ఈ సందర్భంగా 1975 సంవత్సరాన్ని తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా పరిగణించడం జరుగుతున్నది.

ప్రపంచ మహాసభలకు నాందిగా రాష్ట్రంలోని పలు ప్రదేశాలలోను, ఢిల్లీలోను సంగీత, నాటక, నృత్య, జానపద కళోత్సవాలను నిర్వహించే బాధ్యతను, ఆయా కళారంగాలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించే బాధ్యతను స్వీకరించవలసిందని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని ప్రపంచ తెలుగు మహాసభల కార్యవర్గం కోరింది. ఈ కార్యక్రమం క్రింద అకాడమీ విజయవాడలో నాటకోత్సవాన్ని, అనంతపురంలో వీధినాటకం సదస్సును, నిజామాబాద్‌లో నృత్యోత్సవాన్ని, తిరుపతిలో సంగీతోత్సవాన్ని ఢిల్లీలో ఆంధ్రప్రదేశ్ జానపద, నాటక కళోత్సవాన్ని నిర్వహించింది,

ఈ సందర్భంలో సంగీత, నృత్య, నాటక, చలనచిత్రాలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించే అవకాశం కల్పించి, అకాడమీ గ్రంథ ప్రచురణ కార్యక్రమానికి ప్రపంచ తెలుగు మహాసభల కార్యవర్గం దోహదం చేసింది. అందుకు వారికి మేమెంతో కృతజ్ఞులం. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని ప్రచురించిన అనేక గ్రంథాలలో ఈ "ఆంధ్రుల నాట్యకళ " ఒకటి. ఈ గ్రంథాన్ని రచించిన భరతకళాప్రపూర్ణ నటరాజరామకృష్ణగారికి మా ధన్యవాదాలు.

జె. బాపురెడ్డి
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ.

# ముందు మాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధుల నందరినీ ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండు వేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలంనుంచి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదు కోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడే వారి తరువాతి స్థానం తెలుగు వారిదే. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్యపరిపాలనా యుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతీ సంప్రదాయాలను ఆ యా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా

ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయిత లందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీల అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగు వారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయు లందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు,
ప్రపంచ తెలుగు మహాసభలు

# నా మాట

శాత వాహనుల నాటినుండీ నేటి వరకూ
తెనుగు దేశమున వర్ధిల్లిన నృత్యకళా
వికాసము యొక్క సంక్షిప్త చరిత్ర.

'ఆంధ్రుల నాట్యకళ' అనే ఈ చిన్ని పుస్తకము. ఆంధ్రుల సంపూర్ణ నాట్యకళా చరిత్ర రచన చేయాలనే ఆశయంతో ఇరవై సంవత్సరాలు పరిశ్రమించి ఆంధ్ర దేశమందేగాక, భారతదేశమంతటా పర్యటించి, పరిశోధన సల్పి అనేక నాట్యాచార్యులు, ప్రసిద్ధ నర్తకులు కళానేత్తలు, పండితులు, విద్వాంసులను సందర్శించి 30,000 (ముప్పదివేల) పుటల గ్రంథం సేకరించాను—1500 రేఖాచిత్రములు, త్రివర్ణ చిత్రములు రచన చేయించాను. ముఖ్యమైన దేవాలయా లన్నింటిలోనూ ఉన్నట్టి ప్రాచీన నృత్యశిల్ప భంగిమల ఫొటోలు తీయించాను. బహుకాల వ్యయప్రయాసలకోర్చి గ్రంథం సమకూర్చ గల్గినా, ఇంతటి మహత్తర గ్రంథం నా ఒక్కనివలన ముద్రణ చేయించుట సాధ్యంగాని పని కావటంచే ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారికి ముద్రణకు సమర్పించాను. అకాడమీ వారు నాలుగు భాగాలుగా ఆ చరిత్రను ముద్రించుటకు దయతో అంగీకరించారు. ఆ బృహద్గ్రంథములోనుండి యేరికూర్చినట్టిదే ఈ చిన్ని పొత్తము.

ఈ గ్రంథ రచన నాచే చేయించి ఆంధ్ర సరస్వతికి సేవచేసే అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

కళా సరస్వతికి అంజలిఘటించి ముగిస్తున్నాను.

హైదరాబాదు, 1-11-74 **నటరాజ రామకృష్ణ.**

# ఒక్క మాట

'Telugu, the Etalian of the East'.

'Telugu, the cultural Language of the South'.

'Telugu, the Language of Abhinaya'

'Kshetrayya, the creator of Abhinaya'.

—భారతీయ సాంస్కృతిక చరిత్రను పరిశోధించిన చరిత్ర కారులు ఈ విధంగా చెప్పుదురు.

ఇటలీ దేశభాష అతిమృదువై, సంగీతానికి అనువైన భాష. ఆ భాషను తెలిసిన విదేశీయులు, తెనుగును వినినప్పుడు, తెనుగు యొక్క తీయందనానికి ముగ్ధులై పై విధంగా కొనియాడారు.

తెనుగు మధురమైన భాష. సంగీతానికి అనుకూలమైన భాష— భారతదేశ సంగీతకళ ఉత్తర దక్షిణాది, సంప్రదాయాలుగా విడిపోయి రెండు విధాలుగా రూపొందిన కాలంలో ఉత్తరాదిన వ్రజభాష, దక్షిణాపథమున తెనుగు భాష సంగీత భాషలుగా ప్రాముఖ్యం వహించినవి.

తెనుగు మాతృభాషకాని దక్షిణాది కవులు, గాయకులు, పండితులు, కళావేత్తలు గూడా ఆ భాషను అభ్యసించి, అందులో సంగీత రచనలుచేసి, కర్ణాటక సంగీతము నభివృద్ధి పరిచినారు. కను కనే నేటి శాస్త్రీయ కర్ణాటక సంగీతములో తెనుగు భాషను తీసి వేసిన బహుకొద్దిపాటి మిగులుతుంది.

దక్షిణాది శాస్త్రీయ సంగీతాన్ని ఐదువిధాలుగా చెప్పవచ్చును-

1. సంకీర్తన సంప్రదాయం.

2. పద సంగీతము.

3. యక్షగాన సంప్రదాయము.

4. కలాప, ప్రబంధ సంప్రదాయము.

5 గాత్రకచ్చేరి రీతి.

ఈ ఐదు పద్ధతులను సృష్టించినవారు, అభివృద్ధిపరచి ప్రచారములోనికి తెచ్చినవారు ఐదుగురు మహాపురుషులు.

అన్నమయ్య, క్షేత్రయ్య, నారాయణతీర్థ, సిద్ధేంద్ర, త్యాగయ్యలు తెనుగువారే. అదేతీరున—

నట్టువమేళ నర్తనము—స్త్రీలచే ప్రదర్శింపబడే లాస్యపద్ధతి, ఏకపాత్ర నృత్య సంప్రదాయము (భరతనాట్యం).

నాట్యమేళము:-పురుషులచే ప్రదర్శింపబడే తాండవరీతి, బహుపాత్ర నృత్య నాటక సంప్రదాయము (భాగవత సంప్రదాయము) ఈ రెండు రీతులు సమాన స్థాయిలో పెంపొంది ప్రచారములోనికి వచ్చినవి ఆంధ్రదేశమందు మాత్రమే. ఇట్టి విశేషము భారతావనిలో మరెచ్చటనూ లేదు.

# భరతుని నాట్యశాస్త్రములో ఆంధ్రుల నృత్యకళను గూర్చి

శ్లో॥ మహేంద్రో మలయః సహ్యో మేకలః పాలమంజరః।
ఏతేషు సంశ్రితా దేశాస్తే జ్ఞేయాదక్షిణా పథాః॥
కోసలాస్తోసలాశ్చైవ కలింగా యవనాః ఖసాః।
ద్రమిడాంధ్రమహారాష్ట్రా వైణ్ణావై వానవాసజాః॥
దక్షిణస్య సముద్రస్య తథా వింధ్యస్య చాంతరే
యె దేశాస్తేషు యుంజీత దాక్షిణాత్యాంతు నిత్యశః॥

మహేంద్ర మలయాది పర్వతములుగల దేశమునకు దక్షిణాపథమని పేరు. ఈ దక్షిణాపథము ఆంధ్ర, ద్రమిడ, ఆంధ్ర మహారాష్ట్రాది ప్రాంతాలతో కూడినట్టిది. దీనికుత్తరమున వింధ్య పర్వతములు, దక్షిణమున సముద్రమును హద్దులు. అట్టి దక్షిణ భారత మండలి జనులు పలు విధములైన నృత్యగీత వాద్యములతో దాక్షిణాత్యమని ప్రసిద్ధిగాంచిన 'కైశికీవృత్తి' యందు నాట్యము చేయుదురు. ఈ శ్లోకమునగల 'వైణ్ణా'యను దానికి కృష్ణవేణి, పెన్నా తీరవాసులని అభినవ గుప్తాచార్యులు తమ వ్యాఖ్యానములో తెల్పియున్నారు. ఈ ప్రదేశమంతయూ ఆంధ్ర దేశంలోనున్నది. 'ఆంధ్ర మహారాష్ట్ర' అనే పదాన్ని 'the great-Andhra Empire' అని శ్రీ మనోమోహన్ ఘోష్ అనువదించినారు.

# జక్కుల పురంధ్రి

సీ॥ కోణాగ్ర సంఘర్ష ఘుమ ఘుమ ధ్వని
తారకంఠ స్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
కొడుపుచే దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబు జూపంగ వలయుచో
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కు గల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

తే॥ రాగమున నుండి లంఘించు రాగమునకు
నురమయూరు ద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపుబాడుచు వచ్చె జక్కుల పురంధ్రి.


తెనుగుదేశ సాంప్రదాయ నృత్యకళ
నట్టువ మేళము
(స్త్రీలు ప్రదర్శించు
నర్తన రీతి)
నాట్య మేళము
(పురుషులు ప్రదర్శించు
నర్తన రీతి)


నట్టువ మేళము
ఆలయ సంప్రదాయము
(ఆగమ నర్తనములు)
(శైవ, వైష్ణవ రీతులు)
కచ్చేరీ సంప్రదాయము
(భరత నాట్యము)
భాగవత సంప్ర
దాయము
(కలాపములు
భామాకలాపము
గొల్ల కలాపము)


నాట్య మేళము
యక్ష గానము
వీధి నాటకము
వీధి భాగవతము
భామాకలాపం
గొల్లకలాపం
దాదినమ్మ ఇత్యా
దులు పగటి వేషములు


కచ్చేరీ పద్ధతి
తాండవము
లాస్యము
నృత్తము
నృత్యము
అభినయము


ఆంధ్రప్రదేశ నర్తన రీతులు
ఆలయ నర్తనము
(స్త్రీలు)
కచ్చేరీ నాట్యము
(స్త్రీలు)
భాగవతరీతి
(స్త్రీలు)
(పురుషులు)
జానపద నృత్యములు
(బృంద నృత్యములు)
గిరిజన నృత్యములు
(బృంద నృత్యములు)

# ఆంధ్రుల నాట్యకళ

అతి ప్రాచీన కాలం నుండి తెనుగునాడులో, శాస్త్రీయ నృత్యకళ రెండు రీతులుగా పెంపొంది ప్రచారములోనికి వచ్చినది — స్త్రీలచే ప్రదర్శింపబడే లాస్య నర్తనను, పురుషులనే ప్రదర్శింపబడే తాండవ నర్తనము. లాస్య నర్తనరీతి నట్టువ మేళమనబడును. తాండవ రీతి నాట్య మేళ మనబడును. లాస్యము స్త్రీలచే ప్రదర్శింపబడిన దగుటచే సుందరము, సుకుమారము కోమలము, లలితముగా నుండెడి అంగ విన్యాసములతో హావభావ ప్రకటనతో కూడి యుండును ఈ నర్తన రీతి కైశికీ వృత్తి ప్రాధాన్యత కలిగి ఉండును. శృంగారము ప్రధాన రసమై, దాని శాఖలుగా ఇతర రసములతో శోభించే నర్తనము కైశికీ వృత్తిలో నుండును. ఆరభటి వృత్తి ప్రాధాన్యత గల్గినట్టిది తాండవము. వీర, రౌద్ర, బీభత్స, భయానక రసములు పోషింప బడుతూ చేయబడే నర్తనము ఆరభటిలో గాంచుదుము.

స్త్రీలు ప్రదర్శించే నర్తనము ఏకపాత్ర కేళికగా రూపొందినది. ఒక నర్తకి సభలో నిల్చి నృత్య అభినయములు ప్రదర్శించుట ఏక పాత్ర సంప్రదాయములో విశేషము.

బహుపాత్ర నృత్య నాటక శైలి, నాట్యమేళము. వీరు రామాయణ, భారత, భాగవతాది కథలను బహుపాత్రల ప్రవేశముతో నృత్య నాటకములుగా ప్రదర్శింతురు.

కములు, కరణాంగ హారములు మండల ప్లవనాదులు, గతిభేదములు, గల్గినట్టి నర్తనము మార్గ పద్ధతికి చెందినట్టిది.

ఈ నర్తనము పూర్వకాలములో ఆలయములందు పూజా సమయములందు వివిధ దేవతల స్తోత్రపరంగా విధిగా ప్రదర్శింపబడేది. ఇట్టి నర్తనములన్నీ ఆగమశాస్త్రములందు తెల్పబడినట్టివి. నాట్య శాస్త్రముల ననుసరించి రూపొందించబడిన కళా విశేషములు ఇవి.

శాస్త్రము ఆధారముతో ఆయా ప్రాంతముల పాలించు ప్రభువుల, నాగరికుల అభిరుచుల ననుసరించి రూపొందినట్టివి "దేశి" నర్తనములు. ఈ నర్తన రీతికి శాస్త్రము ఆధారమైననూ, తరచు ఇందు అనేకములైన మార్పులు కల్గుతూ వచ్చినవి పాలించు ప్రభువులు శైవులైన శివగాధలకు సంబంధించిన ఇతివృత్తము ప్రాధాన్యము వహించి కళావిన్యాసము లుండెడివి అట్లే వైష్ణవ మతాభిమానులైన ప్రభువుల కాలంలో భాగవత కధలు అభిమానించబడినవి. ఈ తీరున ఈ దేశి కళారీతి అనేక శాఖోప శాఖలుగా విస్తరించి అభివృద్ధి గాంచినది. ఒకొక్క ప్రభువు కాలంలో నృత్తము, మరొక్క ప్రభువు కాలంలో నృత్యము, కృష్ణభక్తి విరివిగా ప్రచారమందున్న కాలంలో అభినయము విశిష్ట కళాఖండములుగా రూపొందినవి. మార్గనర్తనము అట్లుగాక అనాదినుంచి నేటి వరకూ ఒకే రీతిగా ఉన్నది. ఈ నర్తనము ఆలయ ఆరాధనలో ఒక భాగమగుటచే ప్రజల అభిరుచులకు ఈ కళారీతికి సంబంధం లేనందున తన ప్రాచీనతను, శాస్త్రీయతను కోల్పోక నిల్చిపోయినది గనుక ప్రాచీన భారతీయ నృత్యకళా విన్యాసములు చూడవలెనన్న ఆలయ ఆగమ నర్తనములందు కవ్పట్టునని కళాపరిశోధకుల అభిప్రాయము.

శాస్త్రీయ నృత్యకళ నాట్యధర్మి, లోకధర్మి అను మరి రెండు విధములుగా కూడా రూపొందినది. ఇవి రెండు ప్రత్యేకంగా నృత్య కేళికనుచేయు పద్ధతులకు సంబంధించినట్టివి.

శాస్త్రములో చెప్పిన రీతిని ఒక భావమునుగాని, ఒక సన్ని వేశమునుగాని ప్రదర్శించుట నాట్యధర్మి. ఇది భారతదేశమంతటా ఒకే రీతిగా ఉండును. కళాకారులందరూ ఒకే శాస్త్రమును అనుసరించి నప్పటికీ లోకధర్మి, ఆయా ప్రాంతముల హావభావ ప్రకటన, అంగ విన్యాసముల ననుసరించి మారుచుండును. భావమొక టేయైననూ, సన్నివేశ మొక్కటే యైననూ ఆయా ప్రాంతీయ ప్రజలు మాట్లాడే భాష, శీతోష్ణ స్థితిగతులు, ఆచార వ్యవహారముల ననుసరించి కేళికా రీతి మారుచుండును. ఇట్టి మార్పులు చేర్పులు లోకధర్మి వికాస మనబడును.

నాట్యధర్మి, లోకధర్మి, మార్గ, దేశి వికాసము గూర్చి జాయ సేనాపతి తన 'నృత్తరత్నావళి'లో చాలా వరకు వివరించియున్నాడు. జాయ కాకతీయ గజ సేనాపతి; కాకతీయ చక్రవర్తి గణపతి దేవుని బావమరిది ఆయన. నాట్యకళను గుండయామాత్యుడనే నాట్యా చార్యునివద్ద అభ్యసించి స్వయంగా ఆడి, పాడి, అనుభవము సంపా దించి ఆ నాటి వరకూ ప్రచారములోనున్న అనేక నాట్యశాస్త్రము లను పరిశోధించి, శాస్త్ర సంప్రదాయములను సమన్వయపరచి, తన అనుభవములను జోడించి నృత్తరత్నావళిని రచన చేసియున్నాడు. అందులో ఆ నాటి ఆంధ్ర దేశంలోని ఎన్నో కళారీతుల గూర్చి చర్చించి యున్నాడు. తాను స్వయంగా నర్తకుడగుటవలన కేళికలో వివిధ నర్తనములందు ప్రయోగించవలసిన జతులు, యతులు, మృదంగ శబ్దజాలములను వేరొక గ్రంథము 'గీత రత్నావళి'యందు పేర్కొ న్నాడు. కాని మన దురదృష్టవశాత్తు ఆ గ్రంథము లభ్యము కాలేదు.

అదియే దొరికియుండిన జాయప పేర్కొన్న నృత్యములన్నీ ఆ కాలములో వారు ఆడిన విధముగా ప్రదర్శించే అవకాశ ముండెడిది.

సంస్కృతము రాజ భాషగా ఉండిన కాలంలో, భారత దేశమంతటా శాస్త్రీయ నృత్యకళ ఒకేరీతిగా అభివృద్ధి చెందినది. ఆభాష ప్రాముఖ్యము తగ్గి, ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందుతూ వచ్చినప్పుడు ఆయా భాషలు, నుడికారము, ఆ భాషను మాటాడే ప్రజల అభిరుచులు, ఆయా ప్రాంతీయుల ఆచార వ్యవహారముల ననుసరించి నృత్య సంగీతాలలో పెక్కు మార్పులు గల్గినవి. అదే అనేక సంప్రదాయాలకు ద్వారి తీసినది. నేటి కాలంలో భరత దేశమంతటా ప్రచారము లోనికి వచ్చిన అనేక నర్తన రీతులు ఈ విధముగా అభివృద్ధి చెంది, ప్రచారము లోనికి వచ్చిన 'లోకధర్మి', 'దేశి' కళారూపములే.

వింధ్య పర్వతములకు దక్షిణాన తెనుగు భాష సాంస్కృతిక, సంగీత భాషగా కళాపేత్తలు, విద్వాంసులచే కనుకొనబడి, గుర్తించబడినది. కనుకనే, ఆ భాషయందే నృత్య సంగీత రచనలు అనేకములు చేయబడినవి. తెనుగుభాష ప్రాముఖ్యము హెచ్చినది. దక్షిణ భరతావని లోని యితర ప్రాంతాల కళావేత్తలు గూడా తెనుగు భాషయందే అనేక రచనల్లు చేసినారు. అందువల్ల నే నేటికీ దక్షిణా పథమంతటా తెనుగు పాటయే వింటాము. తెనుగు ఆటయే చూస్తాము.

ఈ మార్పులను గూర్చి మనకు విపులంగా తెల్పే నృత్య శాస్త్రము శార్ఙ్గదేవుని 'సంగీత రత్నాకరము'; అతడు దేవగిరి యాదవ రాజుల కాలంలో వారి ఆస్థాన విద్వాంసుడుగా ఉన్నాడు. అప్పటికి భారతీయ నృత్య కళ ఉత్తర దక్షిణ దేశ నృత్య కళలుగా పూర్తిగా రెండు రీతులుగా రూపొందుటయేగాక, అనేక దేశీయ రూపాలుగా కూడా పెంపొందినద్దే. మన నృత్య గ్రంథాలలో ముఖ్యంగా జాయప

రచనలో 'గొండ్లి' నర్తనముగూర్చి చదువుతాము. ఈ గొండ్లినర్తనము గూర్చి అనేకులు అనేక విధాలుగా వ్యాఖ్యానించి యున్నారు. 'గొండ్లి' కుండలి నర్తనమని కొందరు, బృంద నర్తన మని మరికొందరు తెల్పి యున్నారు. జాయప భిల్లు జాతికి చెందిన స్త్రీ నర్తనమని తెల్పినారు.

గోండులు అతిప్రాచీన ద్రావిడ తెగకు చెందినవారు. వీరి సంస్కృతి, నాగరికత ఒక విశిష్టతగల్గి నట్టిది. మధ్య ప్రదేశ్‌లో ఈ గోండులు అనేక సంస్థానములను స్థాపించి పాలించినారు. గోండులు పాలించిన ప్రదేశం "గోండ్వానా" ముప్పది ఆరు కోటలతో కూడిన ప్రాంతము. గనుక దీనిని 'ఛత్తీస్ ఘర్' అని కూడా పిలుతురు. మహారాణి దుర్గావతి ఈ తెగకు చెందిన వీర నారీమణి — గోండు రాజులు నృత్య సంగీత ప్రియులు. గోండ్వానా, ఆంధ్రదేశాన్ని ఆను కొని ఉన్న ప్రాంతము. చాందా, సిరువంచ, బస్తరు మొదలైన సంస్థానముల ప్రభువులు గోండ్వానా రాజ వంశీయులే. వీరి ఆస్థానముల లోని "కేళికా' రూపము 'గోండ్లి' అయి యుండును. అది ఏకపాత్ర నృత్య కేళిక. తెనుగు నాడు నుండి కళావేత్తలు ఆ సంస్థానముల దర్శించి నప్పుడు ఆ నృత్య రీతిని దర్శించే అవకాశము కలిగి ఉండును. ఆ నృత్యమును జూచి ముగ్ధులై, అదొక దేశీయ కళా రూపంగా మన నాట్య గ్రంధాలలో పేర్కొన్నారు.

తెనుగు దేశంలో పెంపొందిన నృత్యకళ గూర్చి వివరంగా తెలిసికోవలెనన్న ఈ దేశములో వెలిసిన మతములు గూర్చి గూడా తెలిసికొనుట చాలా అవసరం. ప్రాచీన కాలంలో మతానికి కళలకు చాలా దగ్గర సంబంధముండినది. మతముపై ఆధారపడియున్న సంస్కృతి పెంపొందినది. అలంతాలు సాంస్కృతిక నిలయాలైనవి.

ఆదిలో వైదిక మతము వ్యాప్తిలో నున్నప్పుడు యజ్ఞ యాగాది క్రతువులందు నృత్య సంగీతములు ఒక భాగమై ఉండినవి. వివిధ దేవతలను నృత్య సంగీతములతో స్తోత్రముచేసి ఆనందపరిచే వారు. యజ్ఞయాగాది సమయములందు యువతులు సర్వాలంకార శోభితులై వీణాగానము చేయుచుండగా, చక్కని దేహసౌష్ఠవముగల యువకులు వీరరస మొలుకునట్లు నర్తనమాడేవారు. పంచభూతముల ఆరాధనకు సంబంధించిన అనేక శుద్ధ నృత్తములుండేవి. అందుకొన్ని నేటికీ మనకు మిగిలియున్నవి. ఇవి మంత్రశాస్త్ర, బీజాక్షర శబ్దజాలములతో మిళితమైన మృదంగ జతులు వీటిని మార్దంగికులు వాయించు చుండగా ఆయా దేవతలకు సంబంధించిన కరణములు నర్తకులు ప్రదర్శించేవారు.

వేదమతము తరువాత బౌద్ధము, జైనము తెనుగు దేశంలో విశేషంగా ప్రచారము లోనికి వచ్చినవి. బౌద్ధుల కాలంలో నృత్యకళ విశేష ప్రచారములోనికి వచ్చింది. అనేక మంది నాగరికులు తమ బిడ్డలకు నృత్య సంగీతములు నేర్పి, బుద్ధ దేవుని ఆరాధించు నిమిత్తం వారిని ఆలయాలకు సమర్పించినట్లు చరిత్రలందు కన్పించుచున్నది. ఆంధ్రలో మహాయాన బౌద్ధము విశేష ప్రజాదరణ పొందినది. అనేక ఆరామాలు, స్థూపాలు వెలసినవి. అచ్చట నృత్య గానములు బుద్ధ దేవుని ఆరాధనలో ఒక భాగముగా ఉండినవి. బౌద్ధ స్థూపములందలి సుందర శిల్పము, నృత్య భంగిమలు తిలకించినప్పుడు ఆనాటి ఆంధ్రుల నృత్యకళా విశిష్టత తెలిసికోగలము. శాతవాహన, ఇక్ష్వాకు రాజుల చరిత్రలు మనం చదివిన అందు నృత్య కేళికలకు సంబంధించిన అనేక అంశముల గూర్చి తెలియును. హాలుని గాథా సప్తశతి, గుణాఢ్యుని బృహత్కథలో ఎన్నో నృత్యానికి సంబంధించిన సన్నివేశాలు వర్ణించ బడి యున్నవి. బౌద్ధము కొన్ని శతాబ్దములు మాత్రమే మన దేశం లోఉండి, తరువాత తూర్పు దేశాలకు వెళ్ళిపోయినది. జైనము

అట్లుగాక కాకతీయుల కాలము నాటి వరకూ మన దేశంలో విరివిగా ప్రచారమందుండినది. చోళులు, చాళుక్యులు కొందరు జైనమతాభిమానులై నృత్యకళను పోషించారు, ప్రోత్సహించారు. వారి ఆస్థానములందు నర్తకీ మణు లుండేవారు. 10, 11 శతాబ్దాలలో జైన మతము, నృత్య కళకు సంబంధించిన అనేక గ్రంథాలు గుజరాతి, కన్నడ భాషలందు మిగిలియున్నవి. జైనము ఆంధ్ర దేశములో ప్రస్తుతకాలంలో లేకపోయిననూ, గుజరాతు కర్నాటక దేశములందు నేటికీ ప్రసిద్ధ మతముగా ప్రచారమందున్నది. ఆనాటి జైన మత గ్రంథాలలో అనేక నృత్య భంగిమలు, స్థానకములు, నర్తన రీతులు చిత్రించబడి యున్నవి. ఆ చిత్రములను పరిశోధించిన అందలి కరణ, చారీ, అంగహారముల వర్ణనలు, జాయప నృత్త రత్నావళి రచన తీరు ఒకే రీతిగా కన్పట్టును. ఆ గ్రంథాల ద్వారా ఆ కాలంలో ఆంధ్రలో జైన మతస్థులు ఆరాధించిన నృత్యరీతులనుగూర్చి పూర్తిగా తెలుసుకొనే అవకాశము గలదు. జైనముతో పాటు శైవము వీర శైవము ఎక్కువగా ప్రచారములోనికి వచ్చినవి. శివుడు వీరి ఆరాధ్య దైవమగుటచే శివుని పూజలో శైవులు అనేక విధములైన నర్తనములు చేసేవారు. ఆలయాలలో ప్రత్యేక నృత్య మంటపములు వెలసినవి. శివ లీలలకు, శివతాండవమునకు సంబంధించిన అనేక నృత్యములు వీరు చేసేవారు.

కాకతీయుల కాలంలో ముఖ్యంగా పశుపతి సంప్రదాయము మనదేశంలో ఎక్కువగా ప్రచారమందుండినది. శైవ వీరులు దినమున ఆరు పర్యాయములు శివుని నృత్య గానములతో ఆరాధించేవారు. 'శివప్రియము' వారి ప్రత్యేక నర్తనము. 'ఊర్ధ్వతాండవము' శివరాత్రి నాడు లింగోద్భవకాలంలో ప్రత్యేకంగా ప్రదర్శించేవారు. ఈ తీరున ఎన్నో విధములైన శాస్త్రీయ నర్తనములు శివారాధనలో ప్రదర్శింపబడేవి.

ఆ నాడు ప్రచారమందున్న నర్తన రీతులను గూర్చి పండితారాధ్య చరిత్ర, బసవ పురాణము లందు వివరముగా చర్చింపబడియున్నది క్రీడాభిరామంలో కాకతీయుల కళావైభవము గూర్చి వర్ణించబడినది. శ్రీనాథకవి కాశీఖండము, భీమేశ్వర పురాణము, పల్నాటి వీర చరిత్రములందు ఆలయ నర్తనములు, ఆస్థాన కేళికలు, సామాన్య ప్రజల నృత్య వినోదములను గూర్చి వివరంగా వర్ణించియున్నాడు.

శైవము తరువాత మనదేశంలో ప్రచారంలోనికి వచ్చిన మతము వైష్ణవము, వీర వైష్ణవము.

వీరవైష్ణవ ప్రభావములో విష్ణుదేవుని నరసింహావతారమును పూజించుట ఎక్కువగా ప్రచారములోనికి వచ్చినది. నరసింహుడు ఉగ్ర స్వరూపుడు. సింహాచలము, అహోబిలము, యాదగిరిగుట్ట మొదలైన చోట్ల నరసింహునికి ఆలయములు వెలిసినవి. నరసింహుని ప్రణయ లీలలు వర్ణించు 'చెంచులక్ష్మి' కథకు ప్రాముఖ్యము వచ్చినది. విష్ణు సంబంధమైన కథలకు ప్రచారము విరివిగా జరిగినది. ఇచ్చట ఒక విశేషము తెల్పవలసివుంది. విష్ణువు స్వర్గాన్ని వదలి భూలోకానికి వచ్చి, రెండు పర్యాయములు భూలోక వనితలను ప్రేమించి పెండ్లాడి నట్లు పురాణములు తెల్పుచున్నవి. ఆ యిరువురు తెనుగువారి ఆడుబిడ్డలే.

నరసింహ రూపంలో వివాహమాడిన 'చెంచులక్ష్మి' తెనుగు వనిత, చెంచు రాజు కుమార్తె.

శ్రీనివాస రూపంలో ఉండి, వెంకటేశ్వరుడై వెలిసిన విష్ణువును పెండ్లాడిన పద్మావతి నగరి సంస్థాన రాజకుమార్తె. నగరి సంస్థానము చిత్తూరు జిల్లాలో ఉన్నది.

వీరశైవము, వీర వైష్ణవమునకు మధ్య తరుచు తగాదాలు పెరిగి, అది దేశంలో అశాంతికి దారితీసిన సమయంలో శైవ, వైష్ణవముల మధ్య సామరస్యము కుదుర్చుటకుగాను విశేష కృషి సల్పిన శాంతిదూతలు పల్నాటికి చెందిన బ్రహ్మనాయుడు, నెల్లూరు సీమకు చెందిన తిక్కన. వీరు హరిహరనాథ మతము స్థాపించి శివకేశవు లొక్కటే అని మత సామరస్యం కుదుర్చుటకు పాటుపడినారు. దానికి చిహ్నంగా మాచెర్లలో చెన్నకేశ్వరుని ఆలయ ప్రాంగణంలో వీరభద్రుని ఆలయం వెలిసినది. ఆ కాలంలోని నర్తనము గూర్చి పల్నాటి వీర చరిత్రలో ముగ్ధసంగవ్వ కథలో వివరముగా వర్ణించబడి నది. తిక్కన మహాభారత విరాటపర్వములో ఆ నాడు మనదేశంలో ప్రచారంలోనున్నట్టి దేశి నర్తనముల గూర్చి వర్ణించినాడు. ఈ హరిహరమతము మనదేశంలో నేడు కన్పించకపోయిననూ కంబోడియా మొదలైన దేశాలలో వ్యాప్తిచెందినది. అచ్చటి ఆలయ శిల్పాలలో హరిహరునకు సంబంధించిన ప్రత్యేక శిల్పముండుట విశేషము.

కాకతీయుల తరువాత వైష్ణవ మతాభిమానులైన విజయనగర రాజుల కాలం మన కళలకు స్వర్ణయుగము. వారి కాలంలో నృత్య సంగీతాలు విశేషంగా ఆదరించబడినవి. రాయల రాజమహలులో ప్రత్యేక నృత్యమందిర ముండినది. అందు శాస్త్రీయ నృత్యానికి సంబంధించిన అనేక భంగిమలుండినవి. నర్తకీ జనము ఆ మందిరములో నృత్య సాధన జేసెడివారు. రాజులు ప్రత్యేకంగా ప్రతి సంవత్సరం వసంతోత్సవములు జేసెడివారు. ఆ సమయంలో వారి సామ్రాజ్యములోని అన్ని ప్రాంతాల నుండి కళాకారులు రాజధానీ నగరానికి వచ్చి తమ పాండిత్యము ప్రదర్శించి సత్కారం పొందే వారు. ఈ కాలంలో విష్ణు పురాణము, భాగవత కథలకు విశేష ప్రచారము కల్గినది.

శ్రీకృష్ణదేవరాయని ఆస్థానములోని అష్టదిగ్గజాల ప్రబంధ రచనలు చదివిన అందు నృత్యానికి సంబంధించిన ఎన్నో వర్ణనలు మనకు కన్పట్టును. కొండవీటి నేలిన రెడ్డిరాజులు గూడా విశేషంగా నృత్యకళను పోషించారు. కొమరగిరి ప్రభువు నృత్యకళపై ఒక ప్రత్యేక రచన 'వసంతరాజీయ' మను పేరుతో చేసినాడు. కాని ఆ రచన మనకు లభ్యంకాలేదు. విజయనగర సామ్రాజ్య పతనముతో ఆంధ్రుల కళాలక్ష్మి తంజావూరుకు తరలివెళ్ళినది. ఆంధ్రదేశం చిన్న చిన్న జమీందారీ ప్రాంతాలుగా విభజింపబడి పాలింపబడినది. తంజావూరునుపాలించిన నాయక రాజులు విష్ణుభక్తులు. వారి ఆస్థానములో అనేక మంది కవులు, కవయిత్రిలు ఉండినారు. అనేక విధములైన నాట్యరీతులు ప్రచారంలోనికి వచ్చినవి. యక్షగానము ఒక విశిష్ట కళా రూపంగా పెంపొంది ఆదరించబడినది. ఆస్థానకవులు, కవయిత్రిలే గాక రాజులు గూడా యక్షగాన రచనలు చేసినారు. మధురనాయక రాజుల ఆస్థానములో గూడా నృత్య సంగీతములు విశేషంగా అభివృద్ధిగాంచినవి. నాయక రాజుల తరువాత తంజావూరును పాలించిన వారు మహారాష్ట్రి ప్రిభువులు. వారి మాతృభాష మరాఠీ అయిననూ, తెనుగుభాష యొక్క మాధుర్యానికి ముగ్ధులై, ఆ భాషనే ఆస్థానభాషగా స్వీకరించుటయేగాక, ఆ భాషను తాము అభ్యసించి, అందులో అనేక యక్షగానములు రచించినారు.

వల్లభాచార్యుని అవతారముతో మన దేశంలో కృష్ణభక్తి, మధురభక్తి సంప్రదాయము ప్రచారములోనికి వచ్చినది. మాధవునికి ఆలయాలు గోపాల, వేణుగోపాల రూపంలో వెలిసినవి. రాధా మాధవ ప్రణయ లీలలు మధుర కావ్యాలుగా రచించబడినవి. భాగవత కథలు విశేషంగా ప్రచారములోనికి వచ్చినవి. రాధా మాధవ ప్రణయ లీలలు, విరహ వియోగాలు ఖండ కావ్యాలుగా రచన చేయ

బడి అభినయించబడినవి. నాటి నుండి సాత్త్వికాభినయము ఒక ప్రత్యేక కళగా అభివృద్ధి చెందినది.

అటుపై మనదేశంలో వ్యాప్తమైన మతము-ఇస్లాం. ఇస్లాంకు చెందిన పాదుషాలు గోల్కొండ రాజధానిగా సామ్రాజ్యాన్ని నెలకొల్పి పాలించారు. వారు తెనుగు భాషను, సంస్కృతిని ఆదరించారు. వారి ఆస్థానములందు ఎందరో నర్తకీ మణు లుండినారు. పాదుషాల కాలంలో హైందవ సంప్రదాయ కళలు వారి యొక్క అభిరుచుల ననుసరించి పోషించబడినవి. అంతేగాక అందొక పాదుషా సంస్కృతంలో అలంకార శాస్త్రం రచన చేయుట ఒక విశేషం. గోల్కొండ పాదుషాల తరువాత ఈ ప్రాంతాన్ని నిజాములు పాలించారు. వారి దివాణములలో నర్తనము చేసే వారికి నృత్య కళలో శిక్షణ నిచ్చుటకు లక్నో, ఔధ్ ప్రాంతాల నుంచి కొందరు మహమ్మదీయ నాట్యాచార్యులను రప్పించి పోషించారు. వారు కథక్ నర్తనం నేర్పేవారు. ఆ వంశాలకు చెందిన నాట్యాచార్యుడు ఖాజా భక్షు. వారు 80 సంవత్సరాలు జీవించి మూడు సంవత్సరాల క్రితం కాలం చేశారు.

వారి తరువాత వచ్చిన వారు ఆంగ్లేయులు. వారు క్రైస్తవ ప్రభువులు — వారికి మన సంస్కృతితో సంబంధం లేకుండినది. వారి కాలంలో ఆంధ్రలో ఉండిన అనేక చిన్న జమీందారులు, స్వదేశీ సంస్థానాధిపతులు నృత్య కళను అభివృద్ధి పరిచారు. కళాకారులను పోషించారు. బొబ్బిలి, పిఠాపురము, నూజివీడు, కొల్లాపురము, వేంకటగిరి, కాళహస్తి మొదలైన సంస్థానముల నేలిన ప్రభువులు వెలమదొరలు. విజయనగరము, పెద్దాపురము, తుని, మొగల్తుర్రు, కార్వేటి నగరము మొదలైన సంస్థానముల రాజులు క్షత్రియులు. గద్వాల సంస్థానాధి పతులు రెడ్డి రాజులు చల్లపల్లి, ముక్త్యాల, జయంతిపురం వారు. కమ్మవారు.

వీరందరూ నృత్య సంగీత కళలను పోషించినారు. బొబ్బిలి ఆస్థానములో రాజ నర్తకీ మణులు కేళిక చేసేవారు. ఆలయాలలో నృత్య పూజ ఉండినది. సామాన్య ప్రజల కొరకు భాగవత కళ వృద్ధి జెందినది.

విజయనగర గజపతులు కచ్చేరీ కర్నాటక నర్తనమును, భాగవత కళను మాత్రమేగాక హిందూస్థానీ సంగీతమును, ఉత్తరాది నర్తన రీతులను గూడా పోషించారు. పిఠాపురము జమీందారీ ప్రాంతమేగాక ప్రసిద్ధ తీర్థయాత్రా స్థలము. అచ్చట వెలసిన కుక్కుటేశ్వరుని ఆలయమందు, కుంతీ మాధవుని కోవెల యందు నృత్య పూజ ఉండినది. సామాన్య ప్రజల అభిమాన కళ అయిన భాగవత నర్తనము వృద్ధి చెందినది. కర్నాటక కచ్చేరీ నర్తనంగా, విశిష్ట కళా రూపంగా పెంపొందినది. పెద్దాపురము సంస్థానంలో ముఖ్యంగా కచ్చేరీ నర్తనము వృద్ధిగాంచినది. నూజివీడు ప్రభువులు కళా పోషకులే గాక అందొకరు జయదేవుని గీతగోవిందము, నారాయణ తీర్థుల వారి కృష్ణలీలా తరంగిణిని సంస్కృత ప్రబంధ యక్షగానాలకు తెనుగు రచనలు చేసి ప్రచారములోనికి తెచ్చినారు.

కాళహస్తి ప్రసిద్ధ క్షేత్రమగుటచే శైవాగమానికి సంబంధించిన నృత్య కళ అచ్చట అభివృద్ధి చెందినది. రాజాస్థానములో కచ్చేరీ కర్నాట నర్తనంగా పోషింపబడినది.

వేంకటగిరి ప్రభువులు ఆస్థానములో ఎందరో నాట్యాచార్యులుండినారు. ఆ ప్రభువులు ఉత్తర హిందూస్థానీ నృత్య సంగీతాలను గూడా పోషించారు. దేశంలోని అన్ని ప్రాంతాల నాట్యాచార్యులను సమావేశపరచి "సభారంజని" అనే నాట్యగ్రంథాన్ని ఈ ప్రభువులు రచన చేశారు. అందు భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో

వికసించిన శాస్త్రీయ నృత్యకళా రీతుల గూర్చి వివరించబడినది. కార్వేటి నగర రాజుల ఆస్థానములో ఉండిన గోవిందసామయ్యా కొన్ని అపూర్వమైన వర్ణములు, నృత్యకళకు అలంకారమనదగినట్టివి రచన చేసినాడు. వీరి సంస్థానములోని సారంగపాణి అనే కవి, ఆ రాజుల ఇలవేల్పు వేణుగోపాలునిపై పదముల రచన చేసినాడు. తిరుత్తనిలోని సుబ్రమణ్యేశ్వరుని ఆలయంలో శైవాగమము ననుసరించి నృత్యపూజ ఈ ప్రభువులు ఏర్పాటు చేశారు.

గద్వాల భూపాలుని ఆస్థానములో శాస్త్రీయ నృత్యకళ పోషింపబడినది. సామాన్య ప్రజల కొరకు వీధి నాటకములు, బయలు ఆటలు ఉండినవి. రెండు అంతస్తుల స్టేజికట్టి, బయలు ఆటలు ఆడుట ఈ ప్రాంతంలోని విశేషం.

ఈ విధంగా స్వదేశీ సంస్థానాధిపతులు మనదేశంలో నృత్య సంగీత కళలను అభివృద్ధిపరిచినారు, పోషించినారు.

కోనసీమలోని అగ్రహారికులు ముఖ్యంగా, సాత్వికాభినయాన్ని అభిమానించుటచే ఆ ప్రాంతములోని కళావేత్తలు విశేషించి అభినయాన్ని ఒక ప్రత్యేక కళారూపంగా వృద్ధిపరిచినారు. అట్లే తూర్పు ప్రాంతంలో భూస్వాములు ప్రాచీన భాగవత సంప్రదాయ కళను పోషించారు. అంతేగాక కొందరు ఆ కళను స్వయంగా అభ్యసించి భాగవత కేళికలందు పాల్గొనుటచే ఆ కళకు విశేష గౌరవం కల్గినది.

ఆంధ్రదేశములో అభివృద్ధి చెందిన నృత్యకళను ముఖ్యంగా ఐదు విధములుగా విభజించవచ్చును—

1. ఆలయ ఆరాధన నర్తనరీతి.
2. నట్టువమేళము ఆస్థాన నర్తనరీతి.
3. నాట్యమేళము ప్రచార నర్తనరీతి.
4. జానపద నర్తనములు.
5. గిరిజనుల నర్తనములు.

# ఆరాధన నర్తన రీతి

ఆరాధన నృత్యకళ అతి ప్రాచీనమైనట్టి, శాస్త్రీయమైనట్టి కళా రూపము. ఈ నర్తనము భారతీయ శిల్పులు మన దేశంలోని దేవతలకు ఆలయాలు నిర్మించిన నాటికే ఒక ఉత్తమ కళాఖండముగా రూపొందినది. కనుకనే ఆలయాలు సుందర కళాఖండములతో, నృత్య భంగిమలతో అలంకరించబడి శోభిల్లుటకు అవకాశముగల్గినది. ఆంధ్ర లోని ఆలయ నృత్యకళను శైవసంప్రదాయ విష్ణు సంప్రదాయము లుగా విభజించవచ్చును. ఈ నర్తనములన్ని ఆగమశాస్త్రముల ననుస రించి చేయబడును. ఈ నర్తనములు కూర్చుటకు ఆధారమైనట్టి ముఖ్యమైన నాట్యగ్రంథము, 'భరతార్ణవము', శైవము, వైఖానసము, పాంచరాత్రము, శాక్తేయము అను నాలుగు ఆగమ శాస్త్రములందు "శాక్తేయము" తప్ప మిగిలిన మూడు శాస్త్రములు తెనగు దేశంలో అనుసరించబడుచున్నవి. దేవి ఆలయములందు కూడ శైవ పద్ధతి ననుసరించి నృత్యపూజ జరుగుచున్నది. పార్వతీ పరమేశ్వరులు ప్రదర్శించిన అనేక నర్తనములలోని ముఖ్యమైన విన్యాసములను పర్శి కూర్చి శాస్త్రీయ కళాఖండములుగా వారి శిష్యులు నంది, భృంగి, తండు అనువారలు రూపొందించినారు. వాటినే నృత్యకరణములం దురు. అవి మొత్తం 108. ఇవి 108 తాళగతులందు ప్రదర్శింపబడును. ఈ కరణములతో కూడిన నృత్యములే ముఖ్యంగా ఆలయములందు పూజా సమయములలో ప్రదర్శింపబడును. శివాలయములందు ప్రద

ర్శించే నర్తనములకు, విష్ణ్వాలయములందు ప్రదర్శించే నర్తనములకు కొంత తేడా ఉన్నది.

ఆరాధన సమయములందు ప్రదర్శించే ఈ శుద్ధ నర్తనము గాక ఆలయము వెలుపల కళ్యాణమండపమువద్ద స్వామి కొలువుదీరి యుండగా నృత్యకేళిక ప్రదర్శింపబడును. ఈ కేళిక నృత్త, నృత్య, అభినయములతో కూడియుండునట్టి వినోదము. ఆరాధన నృత్యములు ముఖ్యంగా రసభావములు లేనట్టి, తాళ లయల నాశ్రయించి యుండునట్టి హస్తపాద విన్యాసములతో కూడినట్టి శుద్ధ నృత్తరీతులు. కేళికలందు నృత్తమేగాక ఆంగికాభినయ ప్రాధాన్యము గలిగిన నృత్యము, సాత్త్విక భావ వికాసముతో కూడినట్టి అభినయము కూడ ఉండును. ఈ కేళిక నృత్తముతో ప్రారంభించబడి అభినయముతో ముగించుట ఆచారము. కొన్ని ప్రాంతములందు ముగింపునందు కూడ నృత్త మాడుట కలదు.

ఆరాధన నృత్యములందు అనేక అపూర్వ తాళములు, రాగములు, ఛందోరీతులు ఉపయోగించబడి ప్రచారము లోనికి తేబడినవి. ఆలయ కేళిక ననుసరించే రాజుల ఆస్థానములలోని 'కచ్చేరి నర్తనము' రూపొందించబడినది ఆలయాల నృత్యకళకు గ్రామ దేవతలకు సంబంధించిన నర్తనములన్నీ దేశీ పద్ధతికి చెందినట్టివి. గరగలు, వీర నాట్యము, కొలుపు నృత్యములు, అగ్ని తిరునాళ్ళ నృత్యములు మొదలైనవన్నీ జానపద నృత్యకళనుండి రూపొందిన కళారూపాలు.

### ఆలయ నృత్యకళయొక్క విశిష్టత

పూర్వము కొన్ని ప్రత్యేక తెగలకు చెందినవారే, ఊర్వశి సంతతి వారనబడు దేవనర్తకినులు మాత్రమే ఆలయాలలో నాట్యము చేయుటకు అర్హత గలిగి యుండేవారు. వీరికి బాల్యమునుండి నృత్య సంగీతములందు, సంస్కృతాంధ్రములందేగాక ఆగమరీతులందుగూడ

శిక్షణ ఇవ్వబడేది; పండితులు పరీక్షించి ఎన్నిక చేసిన పిదపనే వారు దైవ సాన్నిధ్యములో నృత్యమాడే అర్హతను సంపాదించే వారు. అన్యులకు ఆలయము యొక్క సింహద్వారము దాటి గజ్జెగట్టి నర్తన మాడే అర్హత ఉండేదిగాదు. ఈ నర్తకినులు ఆలయములందు తప్ప ఇతరచోట్ల నర్తన మాడెడివారుగారు. రాజులైనను, రారాజులైనను వీరి నర్తనము చూడవలయునన్న ఆరాధన సమయములందు ఆలయములకు వెళ్ళి వీరి నృత్య కేళిక తిలకించెడి వారు. నిరంతరం దైవారాధనలో 'గుడి' సేవలో ఈ కళా కారిణులు ఉత్సవములందు, రాజాస్థానములందు, పండిత సభలందు నాట్యమాడే వారు. దేవదాసీల గూర్చి ఆనాటి సంఘంలో ఉన్న విశిష్ట భావములు గూర్చి ఈ క్రింది సంఘటన తెల్పుతాను. దాక్షారామం ఆలయంలో అమ్మ వారి పేరు మాణిక్యాంబ — ఆ ఊరిలో ఆ పేరుతో పూర్వమొక దేవదాసి ఉండి స్వామి సేవలో జీవితం గడిపి తరించినదట. ఆ అమ్మ వారే ఆ దేవనర్తకి రూపమని, ఆ ఊరి పెద్దలు విశ్వసించే వారు.

# నాట్యమేళవం - ప్రచార నర్తన రీతి

నట్టువ మేళము పూర్తిగా స్త్రీల నర్తనరీతియైనట్లు నాట్య మేళము పూర్తిగా పురుషుల నృత్య పద్ధతిగా చెప్పవచ్చును. ఇది తాండవ పద్ధతికి చెందిన నర్తనము. బహు పాత్రలతో కూడిన నృత్య నాటకములను ప్రదర్శించుట ఈ పద్ధతిలోని విశిష్టత. నాటకములోని స్త్రీ పాత్రలను గూడ పురుషులే ధరించు ఆచారమిందు గలదు. ఇది నృత్య నాటక మగుటచే ఇందు వచ్చెడి వివిధ పాత్రలు వాని వాని మనస్తత్వమును వ్యక్తము చేయుటకు గాను ప్రదర్శించుటకు అనువైనట్టి హస్తపాద విన్యాసములు ఇందు రూపొందించబడినవి. మరియు నవరసములతో గూడిన పాత్రోచిత అభినయము ఈ సంప్రదాయములో గాంచెదము. వివిధ రసములు, వానికి అనువైనట్టి రంగులు, దుస్తులు, వేషధారణ అన్నియు ఇందు భరతుని నాట్యశాస్త్రము ననుసరించి పాటించబడును. ఈ శైలిలో సంగీతము, కవిత్వము, దేశి సంప్రదాయము ననుసరించి రూపొందెంచ బడినట్టివి. ఈ నాట్యమేళ రీతిని ముఖ్యంగా మూడు విధములుగా చెప్పవచ్చును — అవియే యక్షగానము, వీధినాటకము, వీధిభాగవతము. పండితులు, విమర్శకులు, పరిశోధకులు సాధారణముగా ఈ మూడింటిని పర్యాయ పదములుగా ఉపయోగించు చుందురు. కాని శాస్త్రము సంప్రదాయము గురుముఖముగా అభ్యసించిన నాట్య కళావేత్తలు ఈ మూడును వేరు వేరు రీతులుగా పేర్కొందురు.

వేంగి రాజ్యాధీశుడు రెండవ అమ్మరాజు కాలంలో జైన శ్రావకి చామకాంబ అను ప్రసిద్ధ నృత్య కళావేత్త ఉండెను. గుణగ విజయాదిత్యుని ఆస్థానంలో చెల్లవ్వ అనే ప్రసిద్ధ నర్తకీమణి ఉండెను.

కాకతీయ మహా సామ్రాజ్యములో గణుతి కెక్కిన వారు ముద్దసాని; ఆమె మనుమరాలు మాచలదేవి. మాచలదేవి ప్రతాప రుద్ర దేవుని ఆస్థాన ప్రముఖ నర్తకీమణి. ఆమె నృత్య విద్యయందు బహుముఖ ప్రజ్ఞా శీలయేగాక తన జీవిత చరిత్రయే ఒక యక్షగానముగా రచన చేయించి ఆడించి చూచి ఆనందించినది. లకుమాదేవి కొండవీటి కొమరగిరి ప్రభువు ఆస్థాన నర్తకీమణి. రెడ్డి రాజుల కాలమున 'కంచి' అనే ప్రసిద్ధ నర్తకి నృత్య విద్యకు మెచ్చి కంచికచెర్ల గ్రామం ఆమెకు బహూకరించిరి. నేటికీ ఆ గ్రామంలో ఆమె త్రవ్వించిన బావి ఆమె పేరుతోనే పిలువబడుచున్నది. బాపట్ల భావి నారాయణ స్వామి ఆలయానికి చెందిన ప్రసిద్ధ నర్తకి మల్లమాంబ. ఆమె కుమార్తెయే లకుమ. కృష్ణదేవరాయల ఆస్థానములో "కుప్పాయి" అను ఆస్థాన నర్తకి ఉండేది. ఆమె తండ్రి రంజకం శ్రీరంగరాజు. ఆయన విద్యకు మెచ్చి విజయనగర రాజశేఖరుడు "విద్వ స్సభారాయరంజక" అనే బిరుదము నిచ్చియున్నారు. కుప్పాయి కుమార్తె ముద్దు కుప్పాయి ఆస్థాన నర్తకి పదవి నొల్లక తిరుపతి కేగి ఆ స్వామిని నృత్య కళతో ఆరాధించి తరించిన కళోపాసిని.

ముద్దు చంద్రరేఖ ఒక ప్రసిద్ధ నృత్యకళావేత్త. ఈమె తంజావూరు నాయక రాజుల ఆస్థానములోని నర్తకీమణి. పగటి దివిటీల వారు ముందు నడవగా ముత్యాల పల్లకీలో ఆసీనయై ఆమె రాజాస్థానమునకు నృత్య కేళికకు వెళ్లెడిది. మధురవాణి శతలేఖిని; గంటకు నూరు పద్యములు వ్రాసి పండితుల మెప్పించిన కళావేత్త. కృష్ణాజి, మదనరేఖ, శశిరేఖ, రూపావతి — ఇత్యాది కళావేత్త లందరూ తంజా

వూరు నాయక రాజుల ఆస్థానంలో ఉండిన కళావేత్తలు. ఆ కాలములో నుండిన నాట్యాచార్యులలో కాలయ్య ప్రసిద్ధి గాంచెను. రామ భద్రాంబ ప్రసిద్ధ విద్వాంసురాలై సంస్కృతాంధ్రములందు కవిత జెప్పిన కళావేత్త. రంగాజమ్మ పంచభాషలందు కవిత నల్లిన మహాపండితురాలు. ఈమె కవితకు మెచ్చి విజయరాఘవ నాయకుడు కనకాభిషేకం చేసి గౌరవించెను.

తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువుల కాలంలో నుండిన ప్రముఖ నాట్యశాస్త్ర వేత్త విచిత్రరాయ వతంసుడు — ఇతడు అభినయ దర్పణం అను పేరుతో పద్యములందు గ్రంథ రచన చేసెను. నృత్యములో ముద్రలను, హస్తములను ఏయే సందర్భములలో ఏతీరున పట్టవలెనో చక్కగా వివరించి యున్నాడు. నాట్య విద్య నభ్యసించే విద్యార్థులు తాము స్వయముగా అభ్యాసము చేసుకొనుటకు ఈ గ్రంథము ఎంతగానో ఉపకరించును. వారి కాలమందుండిన ఒక ప్రముఖ నర్తకి ముద్దుపళని. ఆమె తల్లి ప్రసిద్ధ నర్తకి తంజనాయకి. గోలుకొండ పాదుషాల దర్బారు నలంకరించిన వారిలో తారామతి, భాగామతి ప్రముఖులు. భాగామతి పాదుషా అర్ధాంగి అయినది; ఆమె పేరుననే హైదరాబాద్ పట్టణం కట్టినట్లు చరిత్రకారులు చెప్పుదురు. తారామతి ఒక సంవత్సరకాలము తన మందిరము నుండి రాజమహల్ నకు కట్టబడియున్న ఇనుప త్రాటిపై భూమిని కాలునిడక నడచివెళ్ళి రాజమందిరములో నర్తనము సలిపిన చతురురాలు. ఇంకను ఎందరో ప్రసిద్ధ నర్తకీ మణులు కలిసి తెలుంగుల నర్తన విద్యకు శోభను చేకూర్చినారు.

ఇచ్చట తంజావూరు నేలిన నాయక రాజుల కాలమున నుండిన ప్రసిద్ధ పదకర్త, సాహితీ వేత్త, సంగీత, నాట్యశాస్త్రములందు నిధి యనదగువాడగు 'క్షేత్రయ్య' ను గూర్చి తెల్పుకొనుట చాలా అవసరం.

దక్షిణ దేశ సంగీత కళను — సంకీర్తన సంప్రదాయము, పదావళి పద్ధతి, యక్షగానరీతి, కలాపబాణీ, కచ్చేరీ గానము — అని ఐదు రీతులుగా చెప్పవచ్చును. ఈ ఐదు రీతులయందు విశిష్ట రచనలు గావించి సంగీత లోకాని కందించిన వారు తెలుగువారే — తాళ్లపాక అన్నమాచార్యులు, వారి సంతతి వారు తిరుపతి దేవునిపై కొన్ని వేల కీర్తనలు రచించి సంకీర్తన సంప్రదాయమునకు శ్రీకారము చుట్టిన భక్త వరేణ్యులు. ఈ సంప్రదాయము నేటికీ దక్షిణ దేశమంతటా ప్రచారములో నున్నది.

భరతవిద్య నృత్తము, నృత్యము, అభినయము, నాట్యము అని నాలుగు విధములుగా ప్రసిద్ధి గాంచినది. అందు అభినయము భరత కళకు తలమాణిక్యముగా, శోభిల్లు చున్నది. భారతీయ కళావేత్తలు ప్రపంచ నృత్యకళకు సమర్పించిన ఒక అమూల్య రత్నం ఈ అభినయకళ. అందు అతి సున్నితమైనది, బహుకష్టమైనట్టిది సాత్త్విక అభినయము. ఈ సాత్త్వికాభినయము దక్షిణ భారత దేశములో ఒక విశిష్ట కళారూపముగా పెంపొంది ప్రచారములోనికి వచ్చినది. అభినయకళ అంతటి మహోన్నత శిఖరాల నందుకొనుటకు క్షేత్రయ్య పదావళియే ముఖ్యకారణము. కనుకనే దక్షిణాపథములోని నర్తక జనము వారి మాతృభాష యేదైననూ తెనుగు భాష నభ్యసించి క్షేత్రయ్య పదములను సాధనచేసి, ఆ పదముల ద్వారా సాత్త్విక అభినయమును ప్రదర్శించుచున్నారు. క్షేత్రయ్య పదములు లేనిదే దక్షిణాదిన అభినయ కళయే లేదని చెప్పవచ్చును. క్షేత్రయ్య నాటినుండే సాత్త్వికాభినయము కైశికీ వృత్తి ప్రధానమైన ఒక ప్రత్యేక లాస్యాంగముగా రూపొందినది. అటుపై వచ్చిన సభాపతయ్య, సారంగపాణి,

సీనయ్య మొదలైన పదరచయితలు, జావళీ రచయితలు ఎందరో రచన లను చేసి ఈ కళకు పుష్టిని చేకూర్చారు.

### యక్షగాన రీతి

పురాణేతిహాసములందలి ఒక ప్రసిద్ధ గాథను నృత్య సంగీతములతో వినికిడి చేయుట యక్షగాన శైలి. యక్షగాన, కలాప పద్ధతులను గూర్చి నాట్యమేళ సంప్రదాయములలో వివరముగా చర్చించుచున్నాను. శ్రీకృష్ణదేవుని దివ్యలీలలు కథాగానముగా రచనచేసి యక్షగాన సంప్రదాయము ప్రచారముచేసిన వారు నారాయణ తీర్థులవారు. వీరి కృష్ణలీలా తరంగిణిని ఒకే నర్తకుడు కథా కాలక్షేపముగా గానము చేయవచ్చును. అంతేకాదు, దానిని కొందరు నర్తకులు కలిసి నృత్య నాటకముగా వేయుటకు కూడా అనుకూలించు రీతిని రూపొందించి యున్నారు.

### కలాప బాణి

కలాపము శృంగార ప్రబంధ రచన. ఇది నర్తకులు పాడుటకు, ఆడుటకు, అభినయించుటకు అనుకూలముగా నుండు రీతిని చేయబడిన విశిష్ట రచన. తెనుగున వచ్చిన కలాపము లన్నింటికి మూలము జయదేవుని గీతగోవిందమని పేర్కొనవచ్చును. తెనుగున మొదటి కలాపము రచనచేసి దేశి సంగీత శైలికి, నృత్య బాణికి విశేష ప్రచారము తెచ్చిన వాడు యోగి సిద్ధేంద్రుడు. దేశీ తాళ విన్యాస రీతులు సంగీత పద్ధతులు, ఛందస్సులు కవితా విధానములు అనేకములు ఈ కలాప బాణిలో ఈయన రచన ద్వారా ప్రచారములోనికి వచ్చినవి.

## కచ్చేరీ సంగీతము

రామ భక్తుడు ప్రసిద్ధ సంగీత శాస్త్రవేత్త శ్రీ త్యాగరాజు. వేలకొలది కృతులను రచనచేసి దక్షిణాది గాత్ర సంగీతమునకు ఒక విశిష్టత చేకూర్చుటయేగాక పాట కచ్చేరీ ఒక ప్రత్యేక కళా రూపముగా పెంపొందుటకు కారణభూతుడైనాడు. త్యాగరాజు కృతులు లేనిదే కర్ణాటక సంగీత కచ్చేరియే లేదని చెప్పవచ్చు.

పై విధంగా ఈ ఐదు పద్ధతుల సంగీత రీతులను సృష్టించి ప్రచారం లోనికి తెచ్చిన వారు తెలుగు వారే.

# నట్టువమేళము—ఆస్థాన నృత్తరీతి

ఈ నర్తనరీతి నాట్యశాస్త్రముపై ఆధారపడి ఆయా సంస్థానాధీశుల యొక్క అభిరుచుల ననుసరించి రూపొందినట్టి విశిష్ట కళారూపము. కనుకనే కొన్ని ప్రాంతములందు నృత్తము, మరికొన్ని ప్రాంతములందు అభినయము విరివిగా అభివృద్ధి చెందినది. శాస్త్ర సంప్రదాయముల సమన్వయములతో పండితుల పరీక్షకు నిలిచినట్టి కళాపద్ధతి ఇది. నట్టువ మేళ మనగా స్త్రీలచే ఆరాధించబడు నృత్య రీతియని తెలిపియున్నాను.

ఇందు పురుషులు గురువులుగాను, హంగుదారులుగాను ఉందురు. కొన్ని మేళములందు పూర్తిగా స్త్రీలే పాల్గొనుట కూడ కలదు. అట్టి బృందముల శిల్పము లనేకములు రామప్ప దేవాలయము నందు, శ్రీశైల ఆలయ ప్రాకారమునందు కలవు. ఈ మేళములు, వాని తీరులు గూర్చి జాయ సేనాపతి తన 'నృత్తరత్నావళి' యందు వివరముగా తెలిపియున్నాడు. "ఆడే నర్తకియే పాడవలెను. ఆ పాట అర్థమును హస్తముల ద్వారా ప్రదర్శించవలెను. అందలి రసభావములు నేత్రముల ద్వారా, ముఖరాగము ద్వారా ప్రకటించవలెను. తాళలయలను పాద విన్యాసములతో చూపవలెను"—అని నాట్య శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ పద్ధతి ఆంధ్రదేశములోని అన్ని సంప్రదాయముల నర్తకులు పాటించుచున్నారు. మనదేశ చరిత్రలో ప్రసిద్ధి కెక్కిన కొందరు ప్రముఖ నర్తకీమణులు:

భారతీయ సంస్కృతిని, హైందవ నాగరకతను, మతమును, పురాణేతిహాసములను చిన్న చిన్న కథల రూపంలో నృత్య, సంగీత, అభినయముల ద్వారా తెలియజేస్తూ ఊరూరా, వాడ వాడలా మారుమూల పల్లెలకు తిరిగి అనేక కష్టనష్టముల కోర్చి ప్రయాణ సౌకర్యములు లేని ఆ కాలములో సామాన్య ప్రజలలో సాంస్కృతిక వికాసమును కలిగించిన వారు నాట్య మేళముల వారు. వారి సేవ మరువరానట్టిది. అపూర్వమైనది. మనదేశ సాంస్కృతిక చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించ దగినట్టిది.

**యక్షగానము**

దీనిని మన దేశంలోని ఒక అతిప్రాచీన కళా రూపముగా పేర్కొన వచ్చును. యక్షులచే ఆరాధించబడిన సంగీతశైలి లేదా యక్షులు అభిమానించిన కళా రూపముగాను పేర్కొన వచ్చును. ఈ కళ బౌద్ధ యుగము నాటికే మన దేశంలో ప్రచారముందున్నట్లు చెప్పవచ్చును. బౌద్ధుల కాలములో ఆంధ్రలో యక్షులనే జాతివారు ప్రతిపాల పురము ముఖ్యపట్టణముగా రాజ్యము నేలియున్నారు. ఆ రాజులు శైవులు. అటుపై బౌద్ధ మతమును స్వీకరించి అచ్చోట ఒక స్తూప నిర్మాణమునకు ప్రోత్సహించినారు. ఆ ప్రతిపాల పురమే "భట్టిప్రోలు" అని పిలువబడుచున్నది. బౌద్ధుల కాలంలో యక్షులు, వారి గాంధర్వ విద్యారాధన గూర్చి ఎన్నో కథలు ఉన్నవి. ఈ యక్షులనే జక్కుల వారని కూడా పిలుతురు. జక్కుల తెగకు చెందిన నర్తకీ మణులను గూర్చి వారి కళా విశిష్టతను గూర్చి శ్రీనాథ కవి తన కావ్యములందు ముచ్చటగా ముచ్చటించి యున్నాడు.

యక్షగానము ప్రారంభదశలో ఒక కథా గానముగా నుండెనది. ఒకే నర్తకిగాని, నర్తకుడుగాని వేషధారణచేసి ఆ కథను గానము చేయుచూ, అందలి వివిధ పాత్రలను తానే అభినయించి, నర్తించి వ్యక్తము చేసెడివాడు. ఇందలి నృత్యము గాని, అభినయము గానీ

విశేషించి శాస్త్రీయ పద్ధతులలో నుండక సామాన్య ప్రజలకు అర్థమయ్యే తీరున వినోదము కలిగించు స్థాయిలో ఉండేది. ఈ ఏక పాత్ర కథా గానము కొంతకాలము ద్విపాత్ర పద్ధతిగా రూపొంది అటుపై బహుపాత్ర నృత్య నాటక శైలిగా రూపొందినది. యక్ష గానములు ప్రాచీన పద్ధతిలో, ప్రాచీన వేష భాషలలో నేటికీ తెలంగాణా ప్రాంతమందు ప్రచారంలో నున్నవి.

## వీధి నాటకము

వీధి నాటకములో ఆట, పాట, అభినయ పద్ధతి యక్షగానము కంటే కొంతవరకు ఎక్కువ పాళ్ళలో శాస్త్రీయ పద్ధతులలో పెంపొందినది. ప్రతిపాత్ర చక్కగా అభినయించుటకు అవకాశముండును. ఆట పాటలతో పాటు మాటకు కూడా ఇందు అవకాశముండుటచే ప్రతి పాత్ర గాత్ర సంగీతముచే గాక వచనము ద్వారా గూడా తన భావము వ్యక్తము చేయుటకు అవకాశ మున్నది. ఈ పద్ధతిలో నృత్యములు కొంతవరకు తక్కువై ఆంగిక సాత్త్వికాభినయములు అభివృద్ధి గాంచినవి ఈ వీధి నాటకములు నేటికినీ ప్రజాదరణ పొంది బహుళ ప్రచారములో రాయలసీమ ప్రాంతములో నున్నవి.

## వీధి భాగవతము

నాట్య మేళములే వీధి భాగవతములని మన దేశములో వైష్ణవ మతము విరివిగా ప్రచారములోనికి వచ్చినప్పటి నుండి పిలువబడు చున్నవి. శైవము, వీరశైవము మన దేశములో ప్రజల అభిమాన మతములైన కాలములో వీరిని నాట్యమేళము లనియే పిలిచెడివారు. మహావిష్ణు అవతారమైన శ్రీకృష్ణ దేవుని పవిత్ర జీవిత గాథ భాగవత మనబడును. ఆ భాగవతము నృత్య, సంగీతముల ద్వారా ప్రజలకు వినికిడి చేయుట 'భాగవతము ఆట' అనబడును. వీథులందు ఈ భాగ

వతము లాడుటచే ఈ ఆట వీధి భాగవతమని పిలువబడెను. ఈ భాగవతము లాడువారే భాగవతులు. భాగవత సంప్రదాయమందు ఒకే పాత్రకు ప్రాముఖ్యముగల్గిన భామాకలాపము, గొల్లకలాపమువంటివే కాక బహు పాత్రలు గల్గినటువంటి నృత్య నాటకములు (ప్రహ్లాద, రామనాటకము, ఉషా పరిణయము మొదలైన వీధి నాటకములు) కూడా ప్రదర్శింప బడును. ఈ సంప్రదాయములో నృత్త, నృత్య, అభినయములు శాస్త్రీయ పద్ధతుల ననుసరించి తీర్చిదిద్దబడినవి. ఆంగికాభినయమందు ముద్రలు, నృత్త హస్తములు ప్రాధాన్యత వహించుచున్నవి నాట్య శాస్త్రములో చెప్పబడిన కరణాంగహార విధానములు ఇందు ప్రయోగించబడుచున్నవి. ఈ సంప్రదాయములో ప్రసిద్ధి వహించిన వారు కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు. వీరికంటే ముందుగానే పోతకమూరి భాగవతులు అహోబిల లక్ష్మీనరసింహస్వామి సేవలో తరించినట్లు చరిత్రలు చాటుచున్నవి. శివ కథల నాడుటలో జంగము దేవరలు ప్రసిద్ధి గాంచినారు. విష్ణు కథల నాడుటలో వైష్ణవ అయ్యావార్లు, కూచిపూడి బ్రాహ్మణులు, దాసరులు మరియు ఇంకెన్నియో తెగలవారు ఉన్నారు. ఇందరిలో ప్రముఖులై 15 వ శతాబ్దము నాటికే ప్రసిద్ధులై తమ విద్యచే విజయనగరము నేలిన వీర నరసింహరాయలను మెప్పించి ప్రశంసల నందిన కూచిపూడి కళావేత్తలు నేటికీ భాగవత కళను ఆరాధించుచున్నారు. ఈ కూచిపూడి భాగవతుల కళకు మూల పురుషుడు యోగి సిద్ధేంద్రుడు. ఈతడు శ్రీకృష్ణ సత్యల ప్రణయ కలహమును ఒక చక్కని ప్రబంధముగా రచన చేసి నృత్య సంగీతములను కూర్చి కూచిపూడి వారికి అందు శిక్షణ నిచ్చి ఆ రమ్య గాథను కలాప రూపంలో ఒక కానుకగా కళాలోకాని కర్పించినాడు. కలాప మనగా వేద వాక్యని అర్థము. మహాత్ముల ప్రతి వాక్కు ఒకసూక్తి యైనట్లు మహాపురుషుడు సిద్ధేంద్రుని రచన రసిక హృదయాల రంజింపజేసి అనేకులచే అనేక రూపములలో భామాక

లాపముల సృష్టికి కారణమైనది. కనుకనే నేటి కాలములో భాగవత మనగా భామాకలాపమే అని అభిప్రాయ పడుచున్నారు. కాని భాగ వతము ఒక విశిష్ట నృత్య సంప్రదాయము. ఆ సంప్రదాయములో ప్రదర్శింపబడే ఒక విశిష్ట ప్రబంధము భామాకలాపము. కనుక భాగ వత మనగా భామాకలాపము మాత్రమే గాక ఆ సంప్రదాయము ననుసరించి ప్రదర్శింపబడే ఏ నృత్య నాటకమైనను కావచ్చును. ఇది కళాకారులు, పరిశోధకులు ముఖ్యముగా గమనించదగిన విషయం.

సిద్ధేంద్రుడు ఏ ముహూర్తమున భామకలాపము రచన చేసెనో గాని అది మనదేశమంతటా అశేష ఆధరణపొంది అన్నినృత్య సంప్ర దాయములకు చెందిన కళాకారులచే ఆరాధించబడుచున్నది. ఈ విధ ముగా వృద్ధిచెందిన కలాప కేళిక నేటికీ మూడు రీతులుగా నిలిచియు న్నది కృష్ణ, గుంటూరు జిల్లాలందు ప్రచారమందున్న కలాపరీతి ఎక్కువగా కూచిపూడి సంప్రదాయముపై ఆధారపడి రూపొందినది. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలందు దేవదాసీలచే ప్రచారములోనికి తేబడిన కలాపశైలి లాస్యపద్ధతిపై ఆధారపడి అభివృద్ధిచెందినది. భాగ వత పద్ధతి అతికష్టమైన శైలిఅగుటచే అది భారతదేశ మందంతటను పురుషులచే మాత్రము అభ్యసించబడుచున్నది. కాని ఆంధ్రలో మాత్రము ప్రత్యేకముగా ఈ రీతిని స్త్రీలు కూడా అభ్యసించియున్నా రు. వీరి పద్ధతికి కూచిపూడి బాణీకి చాలా తేడా ఉన్నది. ఈ రెండు బాణీలుగాక తూర్పున అనగా విశాఖ, శ్రీకాకుళం జిల్లాలందు ఒక విశిష్ట సంప్రదాయము ప్రచారమందున్నది. దీనిని ధ్రుపదబాణి అందురు. భరతుడు నాట్యశాస్త్రమందు పేర్కొన్న ధ్రుపదగానము వాద్యవిశేషము వీరి పద్ధతియందు కన్పించును. ఉత్తర హిందూస్థాన మందలి ప్రాచీన ధ్రుపదగాన వాద్యశైలికి ఈ బాణీకి చాలా దగ్గర పోలికలున్నవి. ఈ మూడు బాణీలందు కథ ఒక్కటియే అయినను సిద్ధేంద్రుని రచనయేగాక ఇతర రచయితలు రచన చేసిన భామాకలా

షములు వారివారి బాణీలలో పాడుట, ఆడుట కలదు. ప్రస్తుత కాలములో మన దేశములో సుమారు ఇరవై వరకు భామాకలాప రచనలు ప్రచారమందున్నవి.

భామాకలాపము తరువాత విశేషముగా ప్రచారములోనికి వచ్చిన 'కేళిక', 'గొల్ల' కలాపము, భామాకలాపము శృంగార రస ప్రాధాన్యముగల్గి భక్తి ప్రబోధము చేయునట్టి రచన గొల్లకలాపము-జ్ఞానవైరాగ్యములను ప్రచారముచేయు రచనా విశేషము. ఇదిచాలా కష్టమైన కలాపము గనుక బహుకొద్ది మంది కళాకారులు అభ్యసించుచున్నారు. ఈ కలాపమును విజయవంతముగా ప్రదర్శించవలెనన్న నర్తకుడు సంస్కృతమందు మంచి పాండిత్యము కల్గియుండవలసియున్నది. ప్రచార నర్తనరీతిలో మరొక ముఖ్యమైన కళాసంప్రదాయము—తోలు బొమ్మలాట, కీలుబొమ్మలాట. తోలు బొమ్మలు అతి ప్రాచీనమైన కళారీతిగాను ఆంధ్రనుండే తూర్పు దీవులు-జావా, బలి-మొదలైన దీవులు కంబోడియా, సయామ్ మొదలైన తూర్పు దేశములకు వెళ్ళినట్లు చరిత్రకారులు అభిప్రాయ పడుచున్నారు. కీలు బొమ్మలాట ప్రస్తుత కాలములో మన రాష్ట్రములో అదృశ్యమైనను తోలుబొమ్మలాట నేటికినీ సజీవముగానున్నది. అంతియేగాక దక్షిణా పథములోను ఇతర రాష్ట్రములకంటే ఉత్తమ స్థాయిలో రూపొందినవి.

# జానపద నర్తనములు

ఈ నర్తనములు ముఖ్యముగా పల్లె ప్రజలు పాల్గొనుటకు వీలైన సులభశైలిలో రూపొందినవి. ప్రచార నర్తనరీతులు పల్లె ప్రజల కొరకు ఏర్పడిన నృత్యరీతులు అయినప్పటికి వాటిని ప్రత్యే కముగా కొందరు కళాకారులు బహు పరిశ్రమచేసి, అభ్యసించి ప్రద ర్శించునట్టి సంప్రదాయ నర్తనములు, జానపద నర్తనములు అటుల గాక ప్రజలందరు పాల్గొని ఆనందించునట్టి సులభశైలి కళాకేళికలు. వీటిని ప్రజాకళలుగా పేర్కొనవచ్చును. ఈ నర్తనములు కొన్ని బృంద నర్తనములు, కొన్ని ఏకపాత్ర నర్తనములుగానున్నవి. మరియు కొన్ని ప్రత్యేకముగా స్త్రీలచే చేయబడునట్టివి, కొన్ని పురుషులచే చేయబడునట్టివి.

# గిరిజనుల నర్తనములు

ఆంధ్రదేశపు అరణ్యములలో నివసించు ఆటవిక తెగలకు చెందినవారు ఎన్నో ప్రత్యేక నృత్యములు చేయుదురు. ఇందుకొన్ని మత సంబంధమైనవి, కొన్ని కేవలం వినోదం కొరకు చేయునట్టివి. గదబలు, సవరలు, చెంచులు, కోయలు, ఆదివాసులు, గోండులు, మాతురీలు, లంబాడీలు మొదలైన వారందరూ వారి వారి తెగలయొక్క ఆచార వ్యవహారములను అనుసరించి వివిధ నర్తనములను రూపొందించుకొన్నారు. ఈ నర్తనములను జాగ్రత్తగా పరిశీలించి అందలి సంగీతమును, రాగతాళ పద్ధతులను, నృత్యగతులను పరిశోధిస్తే ఆయా తెగల యొక్క ప్రత్యేకతలను గూర్చి తెలిసికొనే అవకాశముంటుంది. మాతురీలు హోళీపండుగ అప్పుడు విశేషముగా ఉత్సవములుచేసి నృత్యగానములతో కాలము గడుపుదురు. గోండులు, కోయ మొదలైనవారు వర్షఋతువు ఆరంభంలో "ధరణి దేవత"ను పూజించి నృత్యమాడుదురు. చెంచుల కోవకు చెందిన చెంచువారు నేటికీ చెంచులక్ష్మి నాటకము ప్రత్యేకముగా నాడుదురు. ఇట్లే ప్రతి తెగవారు ఒక ప్రత్యేక పండుగకు ప్రత్యేక నృత్యములు సల్పుటకలదు. ఈ పండుగలు వీరుచేసే నృత్యములు భారతదేశములోని యుతర ప్రాంతముల అందలి గిరిజనులు కళారూపములతో పోల్చిచూసిన భారతదేశములో ప్రాచీన కాలములో కళాసంస్కృతి ఏ విధముగా ఏకరూపముగా నున్నది, అటుపై ప్రాంతీయ ప్రభావముతో నేటి నవనాగరిక ప్రపం

చంలో ఎట్లు విభిన్నరూపముల ప్రచారములోనున్నదీ తెలిసికొన గలము.

## తెలంగాణా, రాయలసీమ, కోసా ప్రాంతమందు అభివృద్ధిజెందిన ప్రత్యేక నృత్య కళారూపములు

### తెలంగాణా ప్రాంతం

యక్షగానం :—అతి ప్రాచీనమైన యక్షగాన కళారూపము నేటికీ ప్రాచీన పద్ధతితో, ఒక్క తెలంగాణా ప్రాంతమునందే ప్రదర్శింపబడుచున్నది. సామాన్య ప్రజల అభిమానకళగా, పల్లె ప్రజలందు నేటికీ మన పురాణేతిహాసముల విశిష్టతను ప్రచారము చేయుచున్నది. కాని ప్రస్తుత కాలంలో ఈ యక్షగాన సంప్రదాయమును జక్కుల వారు ఆరాధించుటలేదు. దాసరి భాగవతులు, బహురూపులు, భరతులు, సైంధవులు మొదలైన తెగలవారు ప్రదర్శించుచున్నారు.

వివిధ ఛంధస్సులందు కూర్చబడిన కవితను గానముచేస్తూ అందుకు తగురీతిలో హావభావముల ప్రదర్శించుచుతూ, సులభశైలిలో నృత్యమాడువారు. వీరి ఆభరణములు ప్రాచీన పద్ధతులలో నున్నవి. రాజు పాత్రలు ధరించే కిరీటములు—కాకతీయ రాజుల కిరీటములను పోలియుండును. వీరు పాత్రలయొక్క తత్వమును అనుసరించి ముఖమునకు రంగురంగుల కోటా వేయుదురు. వీరిది లయ ప్రాధాన్యమైన ఆట గతి ననుసరించి అడుగులు వేయుదురు.

### ప్రాచీన యక్షగానములు

రుద్రకవి, సుగ్రీవ విజయము, అహోబలమంత్రి గరుడాచలమును పోలిన రచనలను వీరు నృత్యమాడుదురు. వీరి యక్షగానము అనంతం[illegible] [illegible]

తీతో రచనలకు చాలా తేడా వున్నది. అవి నృత్యనాటక పద్ధతిలో తీర్చి, దిద్దబడినట్టివి. వీరు ప్రదర్శించునట్టివి, కథాగానపు శైలితో ఉండును.

తెనుగు దేశంలోని యక్షగానమునకు, కర్ణాటక ప్రాంతంలోని పద్ధతికి చాలా తేడా ఉన్నది. కన్నడ ప్రాంతంలోని కళాకారులు నృత్య సమయములో పాడరు. భాగవతుడు వెనుకనుండి పాడిన పాటకు నృత్యము చేయుదురు. ఆ పాటల అర్థాన్ని వాచికము ద్వారా వ్యక్తము చేయుదురు. ప్రతి నర్తకుడు అప్పటికప్పుడు తన పాత్రకు సంబంధించిన వాచికమును స్వయంగా కూర్చి మాటాడును. తెనుగు ప్రాంతమందలి యక్షగానములో ప్రతి నర్తకుడు గానము ద్వారా, తన పాత్రను వ్యక్తము చేయును. ఇందు సంధి వచనము లను మాత్రము సూత్రధారుడు పలుకును.

ఆటయందు, ఆహార్యమందు — రెండు పద్ధతుల యందూ చాలా భేదమున్నది.

## గంటె భాగవతులు

వీరి ప్రదర్శనము ఒక అపూర్వ కళా రూపము. ఇట్టిది భారత దేశమందు మరెచ్చటనూ లేదనియే చెప్పవచ్చును. సాధారణంగా భాగవతములు, వీధి నాటకములు, యక్షగానములు ప్రాచీన కాలంలో కాగడాల వెలుగునందు, అటుపై గ్యాసులైట్ల వెలుగులో వేయుట ఆచారము. ఈ నర్తనా రీతి యందు ప్రతి నర్తకుడు చేతిలో ఒక పెద్ద గంటె పట్టుకొని ఉండును. అందు నూనెబోసి, వత్తి వేయుదురు. నర్తన సమయమందు దీపము వెలిగింతురు. ప్రతి నర్తకుడూ తన పాత్రను అభినయించవలసి వచ్చినప్పుడు ఆ దీపము తన ముఖము వద్దకు తెచ్చి భావప్రకటన చేయును. ఆ దీపము కాంతిలో ఆ పాత్ర ముఖము వింతకాంతులతో గోచరించును. ప్రతి నర్తకుడు తన తన

పాత్రను అభినయించ వలసినప్పుడు ముందుకువచ్చి, ఆ జ్యోతి కాంతిలో హావభావములు ప్రకటించుటకు నేటి కాలంలో సినిమాలందలి "క్లోజప్" ల పద్ధతిలో ఉండును. గంటెలను చేత పట్టుకొని నర్తన మాడుదురు కావున వీరిని గంటె భాగవతులందురు. ఒక చేతిలో దీపముండును గనుక వారి నర్తనము ఒక చేతికి మాత్రమే పరిమితమై ఉండును. కనుక వీరి శైలిలో నృత్తము ఎక్కువగా ఉండదు. భావ ప్రకటన, అందుకు తగిన లయతాళ విన్యాసములు ప్రాముఖ్యముగలిగి ఉంటాయి.

## చిరుతల రామాయణము లేదా చిరుతల భాగవతము

చిరుతలతో భజన చేయుట, ఆంధ్రదేశ మంతటా పల్లె ప్రజలందు ఆచార మున్నది. చిరుతల భజన, భాగవతము రెండింటినీ చేర్చి ఒక విశిష్ట కళా రూపముగా ఈ ప్రాంత ప్రజలు రూపొందించారు. ఈ నర్తన రీతిలో చిరుతల భజన సంగీత శైలి, భాగవత బాణి రెండూ మిళితమై యున్నందున — వీరి నర్తన రీతి ఈ రెండు పద్ధతులను అను సరించి యుండును. నర్తకులు రామాయణములోని కథలను నర్తన మాడుదురు. వివిధ పాత్రల అలంకారములను ధరించి, గుండ్రంగా ఆడుదురు. మధ్యలో మృదంగం, హార్మోనియం వాయించేవారు కూర్చొని ఉందురు. ప్రతి పాత్ర తాము నర్తించవలసిన ఘట్టము రాగానే వలయం మధ్యకు పోయి పాడుతూ, తమ పాత్రను నర్తన మాడుదురు. అది ముగియగానే అందరూ కలిసి వలయముగా తిరు గుతూ, చిరుతలు వాయించుతూ నాట్యమాడుదురు. వీరికి ఎక్కు వగా నృత్యకళలో ప్రవేశము లేనందున, ఇది కేవలం జానపద కళా రీతిగా కన్పించిననూ, దీనియందు కొన్ని శాస్త్రీయ రీతుల చొప్పించి, ఆట, పాట, మాట, ఆహార్యము సంస్కరించి, నర్తకులకు ప్రత్యేక శిక్షణ నిచ్చి ప్రదర్శింపజేసిన ఇదొక అపూర్వ కళా ఖండముగా రూపొందే అవకాశ మున్నది.

పై మూడు నృత్య నాటక రీతులూ తెలంగాణాకు ప్రత్యేక మైనట్టివి.

విప్ర వినోదులు, కాటికాపరులు, సాధనా శూరులు — అను మూడు తెగల వారు ఇంద్రజాల మహేంద్రజాల విద్యల నెరిగినవారు. వీరు ప్రాచీన కాలము నుండే ఈ విద్యలందు ప్రసిద్ధులు. ఈ తెగల వారు తెలంగాణా ప్రాంతమందు తప్ప మరెచ్చటనూ కన్పించరు.

చిందు మాదిగలు వీధి నాటకాలను ప్రదర్శించే ప్రత్యేక తెగ వారు వీరు పగటి పూట నాటకముల నాడుదురు.

ఉగ్గు గొల్లలు, బవనీలు అను తెగల వారు ప్రత్యేకంగా ఎల్లమ్మ దేవత కథను నృత్యగానముల ద్వారా ప్రదర్శింతురు.

జోగు వారను నర్తకులు పంచముల తెగకు చెందిన వారు న్నారు. నృత్య మాడుట వీరి ముఖ్య వృత్తి. ఈ తెగలందు శవమును స్మశాన వాటికకు గొనిపోవునప్పుడు, ఒక ప్రత్యేక పద్ధతిలో నృత్యము జేస్తూ తీసుకొని పోవుదురు. ఆ నృత్యమును వీరు చేయుదురు వీరందరూ ప్రత్యేకంగా తెలంగాణాకు జెందిన వారే.

# రాయలసీమ

ఈ ప్రాంతంలో అశేష ప్రజానీకంచేత ఆదరించబడిన కళా రూపము వీధి నాటకము. మహాభారతంలోని పద్దెనిమిది పర్వములు, పద్దెనిమిది రాత్రులు వేసే బృందములు ఈ ప్రాంతంలో ఉన్నవి. అందు జంగాలపల్లె, కొత్తయిండ్ల బృందాలు చాలా ప్రసిద్ధిగాంచి నట్టివి. ఈ ప్రదర్శనములు కేవలము వినోదములుగాక ఉత్తర హిందూ స్థానమందు రామలీలా, రాసలీల ప్రదర్శనములవలె మతసంబంధమైన భక్తితో కూడా ఏర్పాటుచేయుట కలదు. బకాసురవధ రోజున పల్లె ప్రజలందరూ కలసి ఒక బండికి సరిపోవు అన్నము, కూరలు వండి బండిలోపెట్టి, భీముని పాత్రధారి ఆ బండిపై కూర్చుండి బండినడు పగా జనమందరూ వెంటనడిచివెళ్ళి ఊరి పొలిమేరవద్ద పూజలుసల్పి ఆ అన్నమును బీదలకు దానము చేయుదురు. పాశుపతాస్త్రమును అర్జునుడు సంపాదించుటకు తపస్సు చేసిన ఘట్టములో ఒకచెట్టుకొమ్మను నరికితెచ్చి నృత్యము చేయుచోట పాతుదురు. అర్జునుడు తాపస వేషములో ఆ చెట్టుపైకెక్కి తపస్సుజేయును. ప్రేక్షకులు క్రిందచేరి చూచుచుండ చెట్టుపైనుండి అతడు నిమ్మకాయలు పడవేయును. ప్రజలు వాటిని యేరుకొందురు. ఇట్లు కొంత తడవు జరిగిన పిదప కిరాతార్జునీయ ఘట్టమును కేళిక చేయుదురు. దుర్యోధనవధానంత రము పాండవ పట్టాభిషేకమును ఉత్సవముగా జేయుదురు. ఈ మహా భారత కేళికలందు ప్రతిదినము, సాయంత్రము ఆయా పర్వమునకు సంబంధించిన హరికథాగానము నేర్పాటుచేయించి, రాత్రి వీధి నాట

కము వేయింతురు. ఈ విధమైన మహాభారత ఉత్సవములు చేయుట రాయలసీమలో ముఖ్యంగా చిత్తూరు జిల్లాలో ఆచారముగానున్నది. ఈ బృందములు తమిళనాడులోని తంజావూరు, శ్రీరంగమువరకూ; మైసూరు రాష్ట్రమందును ఎక్కువగా పర్యటన చేయుదురు. వీరి వేషధారణ, అలంకరణ పద్ధతి, ముఖానికి వేసుకొనే కోటా అన్నీ ప్రాచీన పద్ధతిలో ఉండును. వీరి పాట బహు రమణీయంగా, హృదయాహ్లాదకరముగా ఉండును. ప్రజల ఆదరణ, అభిమానము వీరి కళల యెడల ఎంతఉన్ననూ, ఆర్ధిక పుష్టిలేనందువల్ల వీరిలో చాలా మంది యువతరం కళాకారులు ఈ కళను విస్మరించి నాటకముల వాడుట ప్రారంభించినారు.

పూర్వము వీరు రామాయణం, భాగవతం, మహాభారతం—ఈ మూడింటిని వీధి నాటకములుగా ఆడేవారట. నేటి కాలంలో రామాయణం ఆట తెలిసిన వృద్ధులు ఒకరిద్దరు మాత్రమే ఉన్నారు. భాగవతము పూర్తిగా అంతరించినది. ఇక కొద్దికాలంలో మహాభారతం గూడా అంతరించిపోకముందే ప్రభుత్వం వారు ఇతోధిక ప్రోత్సాహమిచ్చి ఈ అపూర్వ కళారీతిని కాపాడవలెను.

బనగానిపల్లి నవాబులు రెండు శతాబ్దముల క్రిందట భాగవత కళాకారులను కర్నూలు ప్రాంతానికి ఆహ్వానించి, కొన్ని కొండ కవట్రాలలో వారెకి భూములనిచ్చి, ఆ కళను ప్రోత్సహించారు. ఈ భాగవతులు కర్ణాటక దేశమందు, మహారాష్ట్రమందు భాగవత కేళీలు జేసి తెనుగువారి కళావిశిష్టత ఇతర రాష్ట్రాలందు గూడా ప్రచారము చేశారు. ఈ సంప్రదాయానికి చెందిన పెద్దలందరూ గతించారు. కొందరు యువతరం వారు మాత్రం మిగిలియున్నారు. ఆదరణ లేక వార్లు కళాసాధనను వీడి, వ్యవసాయ వృత్తిలో జీవించుచున్నారు.

# కోస్తా ప్రాంతంలోని నృత్యరీతులు

## కూచిపూడి నాట్యము

ఈ శతాబ్దారంభంలో కూచిపూడి వెలసిన మూర్తిత్రయంబన దగు ముగ్గురు ప్రముఖ కళావేత్తలు ఈ సంప్రదాయమును, మూడు ప్రసిద్ధ పద్ధతులలో తీర్చి దిద్దినారు.

శ్రీ చింతా వేంకటరామయ్య,

శ్రీ వెంపటి వేంకటనారాయణ,

శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి.

వేంకట రామయ్యగారు, వీధి నాటకములను కూచిపూడి బాణీలో ప్రదర్శించి, విశేషంగా కళా ప్రచారం చేశారు. ప్రాచీన సంప్రదాయయాలకు ఎట్టి హాని కలుగకుండా ఆ బాణీలో అనేక నూతన పద్ధతులను ప్రవేశపెట్టి దేశకాల పరిస్థితులకు అనుకూలించు రీతిని కళను తీర్చిదిద్ది ప్రదర్శనముల నిచ్చారు.

వెంపటి వేంకటనారాయణగారు భామాకలాపం ఆటలో ప్రసిద్ధులు. వీరు భాగవత బాణీలో ప్రదర్శించే ఈ కలాపశైలిలో అనేక శాస్త్రీయ అంశములను చొప్పించి కలాపమును ఒక విశిష్ట కళాఖండముగా తీర్చిదిద్దినారు. దేశి, మార్గ పద్ధతులను మేళవించి ప్రాచీన కళకు ఒక నూతన శోభను చేకూర్చినారు.

వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు స్త్రీలు ప్రదర్శించే భరత నాట్య పద్ధతిలో కూచిపూడి భాగవతాన్ని కూడా, ఒక పాత్ర నర్తనము చేయుటకు అనువైన రీతిని తీర్చిదిద్దినారు. వీరు ఈ కళకు చేసిన సేవ అపూర్వమైనట్టిది. కూచిపూడి నాట్యము ముఖ్యంగా బృంద నాట్య పద్ధతి. ఇది నృత్య నాటకం, కలాపశైలి కథ ననుసరించి ప్రదర్శించే సంప్రదాయం. ఈ నర్తకులు పదములు, అష్టపదులు, శ్లోకములు మొదలైనవి అభ్యసించినను, వారు ఆడే ఆటలో ఈ రచనలకు తావులేదు. శ్రీ శాస్త్రిగారు ఈ రచన లన్నిటినీ చేర్చి, ఒకే పాత్ర రెండు, మూడు గంటలు నాట్యం చేయుటకు సరిపడు రీతిని క్రమపద్ధతిలో ఏర్పరచి ప్రచారంలోనికి తెచ్చినారు. శ్రీ శాస్త్రి గారు భాగవతులు. వీరికి ఈ పద్ధతి ఎట్లు అలవడినదని అభిప్రాయం కలుగ వచ్చును. శాస్త్రిగారు కేళిక నిమిత్తం అనేక ప్రాంతాలు సంచారం చేశారు. సంస్థానాలకు వెళ్లారు. ఆ ప్రాంతాలలో ఉన్న దేవదాసీల, రాజనర్తకీ మణుల విద్యా ప్రదర్శనములు జూచే అవకాశం కలిగినది. కొందరు శాస్త్రిగారి వద్ద కలాప కేళిక నేర్చినారు. వారి సంప్రదాయాలలోని కొన్ని విశేషములను శాస్త్రిగారు తెలిసికొన్నారు. వారి సంప్రదాయ పద్ధతులను అవగాహన చేసికొన్నారు. అటుపై దేవదాసీల ఏక పాత్ర నర్తన రీతిలో, కూచిపూడిని గూడా ఒకే పాత్ర నాట్యము చేయు రీతిని ఏర్పాటు చేశారు. కూచిపూడి భాగవత కళకు సిద్ధేంద్రుడు మూల పురుషుడైనట్లు, కూచిపూడి ఏక పాత్ర నర్తనానికి పునాది వేసిన వారు శ్రీ శాస్త్రిగారు. నేటి కాలంలో కూచిపూడి ఏక పాత్ర నర్తనంగా బహుళ వ్యాప్తి నొందుటకు వీరి కృషి ముఖ్యంగా పేర్కొన దగినది.

ఈ ముగ్గురు ప్రముఖుల తరువాత పేర్కొనదగిన వారు భాగవతుల విస్సయ్యగారు. ఈయన భామాకలాపం, గొల్లకలాపం, బాలింత వేషం, దాదినమ్మ మొదలైన అన్నింటిలో బహుముఖ

ప్రజ్ఞాశాలి. దాదినమ్మ కథ లేదా దాదినమ్మ మంచం ఒక విచిత్ర మైన కేళికా పద్ధతి. ఈ కేళిక జేయువారు మన దేశంలో ప్రస్తుతం ఎవరూ లేరనే చెప్పవచ్చును. నా చిన్నతనంలో చైనీయులు ఇట్టి ప్రదర్శనం కలకత్తాలో చేయగా చూచియున్నాను.

**దేవదాసీల అభినయము**

అభినయకళను గూర్చి తెల్పేముందు దేవదాసీలు వృద్ధిపరిచిన నర్తన పద్ధతిని గూర్చి కొద్దిగా ముచ్చటించుట అవసరము. దేవదాసీల నర్తనము కచ్చేరీ, కర్నాటకమని పిలువబడేది. ప్రస్తుత కాలంలో ఈ నర్తనరీతి భరతనాట్యమనబడుతుంది. నేటి కాలంలో కొందరు పండితులు, శాస్త్ర రచయితలూ భరతనాట్యం తమిళదేశంలో పుట్టిన కళారీతి అని వేదికలపైనుండి ఉపన్యసిస్తున్నారు, రచనలు చేయుచు న్నారు. ఆంధ్రదేశంలో భరతనాట్యం పుట్టినదని, మరికొందరు భరత నాట్యంనుండే కూచిపూడి పుట్టినదని పరస్పరం విరుద్ధమైన భావాలను వెలిబుచ్చుతారు—నేటికీ ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతములందు మిగిలిఉన్న వృద్ధకళావేత్తలు, నాట్యాచార్యులు, నట్టువరాండ్రను కలిసి, ఈ కళారీతిని గూర్చి వివరముగా తెలిసికొనిన, పై అభిప్రా యములోని పొరపాటును గ్రహించగలము. ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రాంతములలోని స్త్రీ కళావేత్తలు (దేవదాసీలు, రాజనర్తకీలు) ప్రదర్శించిన నర్తనమంతా ఒకటే—దీనికిమూలము-ఒకటే-ప్రాంతీయ కళాపోషకుల అభిరుచుల ననుసరించి ప్రదర్శన రీతులందు మాత్రము కొద్దిమార్పులున్నవి. నేడు 'భరతనాట్యము' అని పిలువబడుతున్న నృత్యము తంజావూరులో పుట్టినది—దానిని చిన్నయ్యా, పొన్నయ్యా, వడివేలు, శివానందం—అనే నల్గురు సోదరులు సృష్టించారు అనువా దముగలదు, ఈ నల్గురు సోదరులు తంజావూరును మహారాష్ట్ర రాజులు పాలించిన కాలమందు ఉండినవారు, అనగా సుమారు రెండు

వందల సంవత్సరాల క్రిందట. అంతకుముందుగా తంజావూరు నేలిన నాయక రాజుల ఆస్థానములందు ఎందరో ప్రసిద్ధ నర్తకీమణులుండి వారు. వారు ఎన్నో విధములైన నర్తనములు ప్రదర్శించేవారు. ఆలయాలలో ఎన్నో రీతుల నృత్య కేళికలుండేవి. అందువల్ల భరత నాట్యమని ప్రస్తుతం పిలువబడే ఆ కళారీతిని ఆ నల్గురు సోదరులు క్రొత్తగా సృష్టి జేసినట్టిదిగాదు. అంతవరకూ రాజుల ఆస్థానములో నుండిన కేళికను ఒక నూతన పద్ధతిలో ఏర్పాటు చేసిరేగాని వారు నూతనంగా సృష్టించినదేమీలేదు. ఉత్తర దక్షిణదేశ సంగీతముల సమ్మేళనంతో నేర్పాటైన ఛందోనర్తనములు, తిల్లానలవంటి రచనలు కొన్ని ఈ సంప్రదాయంలో చేర్చి వాటికి నృత్తనృత్యములను కూర్చి ప్రదర్శింపచేశారు. ఈ క్రమము—ఆంధ్రదేశంలో ఒక మూలగానున్న బొబ్బిలి సంస్థానము మొదలుకొని, విజయనగరం, తుని, పిఠాపురం, సిద్ధాపురం, ఏలూరు, వేంకటగిరి, కాళహస్తి, కార్వేటి నగరం; దక్షిణాన మైసూరు, తంజావూరు, పుదుకోట్టై, రామనాధపురం మొదలైన సంస్థానములందంతటనూ ఒకే రీతిగా ప్రదర్శింపబడుతుంది.

### కొద్దిపాటి మార్పులు

దక్షిణాదిని తంజావూరు భరతనాట్యము "అలరింపు"తో ప్రారంభించబడి, తిల్లానతో ముగియుచున్నది. బొబ్బిలి పద్ధతియందు మేళప్రాప్తి ముగించి, శబ్దముతో ప్రారంభించబడుచున్నది. అలరింపు జతిస్వరము శబ్దము, వర్ణము, అభినయము, తిల్లాన—ఇది తంజావూరు క్రమము, మేళప్రాప్తి, శబ్దము, జతిస్వరము, వర్ణము, అభినయముతో ముగియుట లేదా తిల్లానవంటి నృత్తముతో ముగియుట, ఇతర ప్రాంతాలలోని పద్ధతి.

### శబ్దము

రాజులపైగాని, దేవతలపైగాని స్తోత్రముగా కూర్చబడిన ప్రత్యేక సంగీత రచన. గనుక మేలప్రాప్తి ముగియగానే ఈ నర్తన

మాసి పిమ్మట నృత్తమాడుట కొన్ని ప్రాంతాల ఆచారము. జతి స్వరము నృత్త ప్రాధాన్యముగలిగిన రచన. కనుక నృత్తములో ప్రారంభించుట కొన్ని ప్రాంతాల ఆచారము. ఇటువంటి కొద్ది మార్పులుతప్ప కేళిక పద్ధతి అంతా ఒకే తీరుగా నున్నది.

కచ్చేరి నాట్యానికి పనికివచ్చే ప్రత్యేక సంగీత రచనలు జతి స్వరము, పల్లవి, శబ్దము, సలాంజతి, జక్కిణి, తిల్లాన, పదవర్ణము, పదము, జావళి, శ్లోకము, నృత్తము మొదలైన వాటికి—నృత్తనృత్య అభినయములు ప్రదర్శించుట, ఈ సంప్రదాయములోని విశేషము.

దక్షిణదేశమంతటా పర్యటించి పరిశోధన చేయని పెద్దలు కొందరు ఈ విషయములన్నీ తెలిసికొనే అవకాశము లేక, ఎవరో కొందరు పూర్వం రచన చేసిన అసంపూర్ణ రచనలు ఆధారముగా పొరపడి భరతనాట్యము తమిళులదని అందురు. అట్లే కూచిపూడి నుండి భరతనాట్యము పుట్టినదనియు, భరతనాట్యమునుండి కూచిపూడి పుట్టినదనియు కొందరు వాదించుటగలదు.

భరత నాట్యము స్త్రీలచే ప్రదర్శింపబడే ఏక పాత్ర లాస్య సంప్రదాయము. కూచిపూడి పురుషుల కొరకు ఏర్పడిన బహుపాత్ర నృత్య నాటక తాండవశైలి.

ఈ రెండింటికీ మూల శాస్త్రము ఒక్కటే అయినందున కొన్ని పోలికలు కన్పించినను, ప్రారంభ స్థానకము మొదలుకొని అడవుపాము, హస్తముల పొందిక, విన్యాసము, తీరికల తీరు అంతా వేరు వేరుగా నున్నది. కూచిపూడి లయ ఆట, భరత నాట్యము తాళము ఆట. దేశి రచనా రీతులు సంగీతపు పోకడలు, తాళ ప్రస్తారము, భాగవతము ఆటలోని విశేషము. కర్నాటక కచ్చేరి బాణీ సంగీత పద్ధతి, తాళ కట్టుబాట్లు భరత నాట్యములోని విశిష్టత. ఇట్లు ఇంకెన్నో భేదములున్నవి.

అభినయమును ఒక విశిష్ట కేళికా రీతిగా ఆంధ్రిలో ముఖ్యంగా తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలందు, కోనసీమలోని నట్టువ రాండ్రు అభివృద్ధి పరిచారు. పదములు, శ్లోకములు, పదవర్ణములు, జావళీలు-ఇత్యాది నాయికా నాయక సంబంధమైన రచనలకు అలంకార శాస్త్ర, నాట్య శాస్త్రముల ఆధారంగా, సాత్త్విక సంచారుల ప్రదర్శన జేయుట అభినయంలోని ప్రత్యేకత. నర్తకి సభలో కూర్చుండి శుద్ధ సాత్వికాంగముగా ఈ ప్రదర్శన గావించును. ఇట్టి పద్ధతి యితర ప్రాంతము లందున్ననూ, ఈ ప్రాంతములోని కళా పోషకులు, నృత్త నృత్యములకంటే సాత్త్విక ప్రాధాన్యమున కల్గిన అభినయ కళనే యెక్కువగా అభిమానించుటచేత ఈ తీరపు ప్రసిద్ధ నట్టువరాండ్రు ఈ కళలో విశేష కృషి సల్పినారు.

ఒక పదము ఆధారముగా ఒక నాయికను తీసికొని — అందలి అనేక సంచారీ భావములను గంటల తరబడి, అలంకారశాస్త్ర పుటములు తిరుగవేస్తున్నట్లు అందు తెలుపబడిన ప్రతి చిన్న విషయము కూడా బహు సులభముగా, అందరికీ అర్ధమయ్యే రీతిని వీరు అభినయింతురు.

అలంకార శాస్త్రములలో మన ప్రాచీనులు రచించిన వందలాది నాయికా నాయకులు ఆ కళాకారుల కనుగవ కదలికలందు, ముఖ రాగమందు, శరీరము పులకలింతలందు, హస్తముల కదలికలందు, ఉచ్ఛ్వాస నిశ్వాసలందు మనకు సాక్షాత్కరింతురు. ప్రేక్షకులు మంత్రముగ్ధులై గంటల తరబడి తమ్ము దాము మరచి ఆ రస జగత్తులో విహరింతురు. ఇదొక అత్యుత్తమమైన, అద్భుత కళారీతి. అందరు కళాకారులు దీనిని సాధన జేసిననూ ఇది అందరికీ లభ్యపడే విద్య కాదు. ఎంతో సుశిక్షణ, సాధన, గ్రంథ పరనా చేసినప్పటికీ ఈకళలో కొందరు మాత్రిమే సార్ధకత నొందగల్గినారు. వారినే నాటి కళా పోషకులు విశేషంగా గౌరవించే వారు.

అట్టివారిలో ప్రసిద్ధులు చాటపర్రు బాలాత్రిపుర సుందరి, చింతా వీరభద్రం, నాయుడుపేట రాజమ్మ, చెయ్యూరు శారద, మద్దెరాముడు, బొబ్బిలి జీవరత్నం మొదలైనవారు. వీరందరూ కీర్తి శేషులు. నేటి కాలంలో జీవించిఉన్న వారిలో శ్రీమతులు దుగ్గిరాల జగదాంబ, యండమూరి రామరత్నం, చింతా చినగనిరాజు, అన్నాబత్తుల బులివేంకటరత్నం, సరిదె మాణిక్యం, నెల్లూరు జి. నాగమణి మొదలైనవారు ప్రముఖులు. ఇందు శ్రీమతి బులివేంకటరత్నంగారి కళావిజ్ఞానానికి, గౌరవ సూచకంగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు ఆమెకు "భరత కళాప్రపూర్ణ" బిరుదు ప్రదానం చేశారు.

## స్త్రీలు-భాగవత కళ

తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలందు స్త్రీ కళావేత్తలు భాగవత విద్యను కూడా ప్రదర్శింతురు. ఇదొక విశేషము ఈ ఆచారము మరెచ్చటనూ కన్పించదు. ఈ భాగవత విద్యకు మండపేట ప్రసిద్ధి. పూర్వము మండపేటలో భాగవత మేళములెన్నో ఉండేవి. ఈ కళలో విశేష పాండితీ ప్రతిభగల్గి పండితులచే సంగీత సరస్వతి అని కొనియాడబడిన నట్టువరాలు శ్రీమతి దుగ్గిరాల మాణిక్యం. ఈమె భామాకలాపం, గొల్లకలాపం—రెండింటినీ ప్రదర్శించెడిది. కాశే కమలాక్షి అనే నట్టువరాలు కాగడాలవారు ముందునడువ, దాస దాసీజనం వెంటనడువ తొమ్మిది మంది బోయీలు పల్లకీ మోయ భాగవత కేళికకు వెళ్ళెడిదట. భామాకలాపము, గొల్లకలాపములందు పూర్వం ప్రసిద్ధిపొందిన నట్టువరాండ్రు చింతా అంబాసాని, మారంపల్లి పెద వేంకటరత్నం, చినవేంకటరత్నం, వైదేహి, ఇందువదన, పువ్వుల పాపాచలం, పెండేల సత్యభామ, శ్రీరాజితము మొదలైనవారు.

## తూర్పు భాగవతము—ద్రుపద సంప్రదాయము

తూర్పు—అనగా శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు అచ్చటి భామాకలాప కేళికనే భాగవతమందురు.

భామాకలాపము కృష్ణాజిల్లా కూచిపూడిలో పుట్టిననూ, నేటి కాలంలో భామాకలాపానికున్న ప్రచారము, ప్రజాదరణ, ఈ కలాపములాడే బృందములు తూర్పున వున్నన్ని కూచిపూడిలో గూడా లేవనే చెప్పవచ్చును.

వీరిదొక ప్రత్యేక బాణీ, ఈ బాణీ అందరకూ అలవడదు. త్రిస్థాయిగానము, విలంబిత దరువు విన్యాసము—ఇదంతా ఒక ప్రత్యేక శైలిలో రూపొందినది. ఈ కలాపములను ప్రత్యేకంగా పురుషులే ఆడుదురు. ఈ పద్ధతిలో పాటకు ముఖ్యస్థానమున్నది. ఈ నర్తకులు పాడి ఒప్పించాలి.

ఈ పద్ధతిలో పూర్వం ప్రసిద్ధులైన కలాపకళాకారులు శ్రీయుతులు చిత్తజల్లు నరసింహులు, కాలుకుంట వెంకయ్య, మర్లు అచ్చన్న, తణికెళ్ళ సన్యాసయ్య, దూడల అప్పలింగం, చేబ్రోలు సన్యాసయ్య, వరదా ఆది నారాయణ, నందిగామ వెంకయ్య మొదలైన వారు ముఖ్యులు. వీరిలో కవులున్నారు. మహా గాయకులున్నారు. తాళ ప్రస్తారమందు విశేష కృషి సల్పిన పండితులున్నారు. కలియుగ సత్యభామ, పండిత సత్యభామ, గానకోకిల, వసంత గానకోకిల బిరుదాంకితులున్నారు. సింహా తలాటములు, ఘంటాకంకణములతో సత్కరింపబడిన కళావేత్తలున్నారు.

చిత్తజల్లు నరసింహులుగారు మహా ప్రతిభావంతుడైన భామ వేషధారి — వీరు భరత నాట్య రీతిలో, పచ్చికుండలు అనగా కుమ్మరి సారె మీద చేసిన కుండలు, కాల్చక ముందు ఆరబెట్టి ఉంచినట్టి వానిపై

నాట్యమాడే వారు. పాలగచ్చుపై అద్దం బోసి దానిపై అడవులు పట్టేవారు. బహు చక్కని గాత్రం. వీరి గాత్రం విని రెండు మైళ్ళ దూరం నుండి ప్రజలు వీరు తెరలోనికి వచ్చారని తెలిసికొని పరుగు పరుగున కేళికా స్థలానికి పరుగెత్తుకొని వచ్చేవారట.

కాలుకుంట వెంకటస్వామి గారు మహాగాయకులు. వేషం మహా అందమైనట్టిది. ఆయన గానం వింటుంటే దేవలోకం నుండి నారదుడో, తంబురుడో దిగివచ్చిరిగాని నరుడు గాడని ప్రజలు తలంచే టంతటి ప్రతిభావంతులు. వీరు గతించిన పిదప, వీరు భామ వేషంలో ధరించిన "గణియం స్వర్ణ" ముస్తాబు ఎవరికైనా బహూకరించ దలంచి, బహుకాలం వేచి ఉండి, ఆఖరికి శ్రీ వరదా ఆదినారాయణ భాగవతం జూచి, ముగ్ధులై, వారు ఆ గణియం ధరించుటకు అర్హులని వారికి, వెంకటస్వామి గారి కుటుంబము వారు బహూకరించిరట — శ్రీ వరదా ఆదినారాయణగారు పండిత సభలకు వెళ్ళినప్పుడు మాత్రం ఆ 'గణియం' ధరించేవారు. వారిచే ఒక భాగవత గురుకులం అకాడమీ వారు స్థాపింపచేసి తద్వారా ఆ కళను ప్రోత్సహించారు. శ్రీ ఆది నారాయణగారు అకాడమీలో ప్రవేశపెచుటగాను ఆ గణియం అకాడమీకి బహూకరించారు.

తణికెళ్ల సన్యాసయ్యగారు — మహా పండితులు, గాయకులు, చక్కనైన వేషము, శ్రవ్యమైన గాత్రము, ముచ్చటైనమాట, అందమైన నృత్యము, లెస్సయిన అభినయము. వీరు భామాకలాపము, గొల్ల కలాపము ప్రదర్శనలందు విశేష కీర్తి నార్జించారట. వీరి పాండిత్యానికి మెచ్చి బొబ్బిలి రాజావారు వీరికి 'బంగారపు గణియము' చేయించి, వారి ప్రదర్శనానికి ఇద్దరు బంట్రోతులచే పంపించి, ఆ మరునాడు మరల ఆ గణియం కోటలో జాగ్రత్త పరిచేవారట.

ముట్నూరి వారి పంచముఖి — ఐదు తాళములను, ఒకే సారి అయగతులను నడుపుతూ, రెండు కాళ్ళతో రెండు తాళములను, రెండు చేతులతో రెండు తాళములను, జంఘులతో మరొక తాళమును చూపుతూ, నోటితో పాడుతూ నర్తనమాడి — బాగాకు రావడము - ఇందులోని విశేషము. ఇదొక ప్రత్యేక కళాసృష్టి, బహు కళా తపస్సు చేసిన గాని అలవడనిది. ఈ విద్య తెలిసిన వారిలో భారత దేశ మంతటచూ ఒక్కరే ఉన్నారు. వీరు ముట్నూరు సూర్యనారాయణగారు. వీరి తండ్రి కడు పేరు గాంచిన భాగవత సంప్రదాయ మార్దంగికులు, ముట్నూరి సంగమేశం గారు. భుగత గోపన్నగారి శిష్యులు.

ఇదంతా తెనుగు వారి నృత్య కళా విశిష్టతను తెల్పే చరిత్ర.

# జరుగుచున్న చరిత్ర

సంవత్సరము వరకు మన నృత్యకళ మహోన్నత
{వించినది. అటుపై ఒక దశాబ్దం కాలము ఈ కళను
{వహించినది. ఆ స్థితినుండి నేటివరకూ పూర్తిగా
నే చెప్పవచ్చును.

ళను, కళారాధకులను నాగరిక సంఘం చిన్న చూపు
ముఖులైన కళావేత్తలు ఈ ప్రదర్శనముల నుండి
్నరు. ఎన్నో అపూర్వ కళారీతులు మరుగునపడి అంత
చ్చినవి.

వరకూ నృత్యకళను కొన్ని ప్రత్యేక తెగల వారు
కుగా ఆరాధిస్తూ వచ్చారు. వారు మాని వేయగానే
ంలన్నీ నశించిపోవ మొదలిడినవి.

ంబ్దము గడిచిన పిదప మరల కళాభిమానులు, కళా
ళల విలువ తెలిసికో నారంభించారు. అన్ని తెగల
ృత్తులకు సంబంధించిన వారు ఈ కళను తమ బిడ్డలకు
రంభించారు.

ు నేర్పుట ఒక సాంస్కృతిక వికాసంగా తలచారు.
త్తలైన కొందరు కళారాధకుల కళా ప్రచారమే

కూచిపూడి నర్తనాన్ని ప్రచారం చేయాలనే సంకల్పంతో ఆ కళను అభ్యసించి, పలుచోట్ల ప్రదర్శనము లిచ్చిన వారిలో ప్రథములు శ్రీ అయ్యంకి తాండవ కృష్ణ, నాట్యదంపతులు శ్రీమతి సామ్రాజ్యం రమణరావుగార్లు. శ్రీ వెంపటి పెద్ద సత్యం కొద్దికాలం రామగోపాల్ బృందంతో పర్యటించి కూచిపూడి నృత్యం ప్రదర్శించారు. గాని అది కొద్ది పట్టణాలకు మాత్రం పరిమితమైనది. ఆంధ్రుల నృత్యకళ యొక్క విశిష్టత, పవిత్రత, వికాసము, ఆనాటి సామ్రాజికులలో ప్రచారముచేసి ఆ కళ పట్ల అధిక గౌరవము, ఆసక్తి కలిగించాలనే ఆశయంతో కాలేజీలు, స్కూళ్లు, మహిళా సభలందు అనేక అభినయ పూర్వక ఉపన్యాసములిచ్చి, పత్రికలందు వ్యాసములు రచన చేసి, నృత్య నికేతనం స్థాపించి, విద్యార్థులను తరిఫీదుచేసి మరుగున పడిపోతున్న అపూర్వ కళారీతులను మరల ప్రచారంలోనికి తేవడానికి నేను ప్రయత్నించాను.

ముప్పది వరకూ మన నృత్య కళలపై గ్రంథములు రచన చేశాను. భారత ప్రభుత్వం అందు ఆరు గ్రంథములకు బహుమతుల నిచ్చారు.

ఆంధ్రలోని శాస్త్రీయ, జానపద సంగీత రీతులు, నృత్య బాణీలన్ని యిమిడ్చి "శ్రీ వెంకటేశ్వర కళ్యాణం" అనే బేలే తయారు చేసి దేశమంతటా ప్రదర్శన లిచ్చాము. అదే హిందీ భాషలో "బాలాజీ" పేరుతో ప్రదర్శించబడినది. కర్నాటక రాగాలకు హిందీ కవిత్వం జతపర్చి పాటలు కూర్చుటకు దక్షిణాత్య నాట్య పద్ధతులలో అభినయం కూర్చుట ప్రథమంగా ప్రయత్నించి విజయం సాధించాము. కాళిదాసు రచన "కుమార సంభవము" సంస్కృతంలో నృత్య నాటకంగా రూపొందించి ఉజ్జయినిలో అఖిల భరత పోటీలలో ప్రదర్శించి ఆంధ్రకు "స్వర్ణ కలశం" గెలుచుకొని వచ్చాము ఈ కళా సేవకు

గుర్తింపుగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు వన్నూ "భరతకళా ప్రపూర్ణ" బిరుదుతో గౌరవించారు.

ఈ విధంగా యువతరం కళాకారులందరూ, తెనుగు నాడులో నృత్యకళను పునరుజ్జీవింప కృషి సల్పుతున్న సమయంలో కూచిపూడి నాట్యం యొక్క శాస్త్రీయతను గూర్చి ఢిల్లీ నుండి ఒక వాదము బయలుదేరింది. అప్పుడు ఆంధ్రలోని కళాకారులందరూ ఏకమై ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యాన సదస్సు జరిపి ఆ కళ యొక్క శాస్త్రీయత నిరూపించి, భారత ప్రభుత్వంచే గుర్తింప చేశారు.

ఆ కాలంలోనే ప్రపంచ రంగస్థలముపై మొదటిసారిగా కూచిపూడి నృత్యకేళిక చేసి ఆ కళకు విశ్వఖ్యాతి నార్జించినవారు శ్రీ కోరాడ నరసింహారావుగారు. ఈయన శ్రీమతి ఇంద్రాణి రహిమాన్ బృందంతో కళాకారుడుగా విదేశాల కేగి, పారిస్‌లో జరిగిన ప్రపంచ నృత్య సభలలో కూచిపూడి నర్తనము ప్రదర్శించి కూచిపూడి యొక్క విశిష్టతను లోకానికి వెల్లడి చేశారు. నాటి నుండి వీర, రౌద్ర, భీభత్స, భయానక రసాలను ఈ సంప్రదాయంలో పోషించుటలో తనకు తానే సాటిగా దేశమంతటా ప్రదర్శనలిస్తూ ఆ కళా ప్రచారము చేయుచున్నారు.

ఢిల్లీ అకాడమీవారు కూచిపూడి భాగవత కళా విశిష్టతను గుర్తించి, ఆ కళా ప్రచారానికి ధనసహాయం చేశారు. కూచిపూడి ఏలూరు, విజయవాడ, గుడివాడ, హైదరాబాద్, మద్రాస్, ఢిల్లీ మొదలైన పట్టణాలలో కూచిపూడి నృత్య శిక్షణకు కళాశాలలు ఏర్పాటు చేయబడినవి.

కూచిపూడి నర్తనాన్ని నేటి కాలానికి అనుగుణంగా తీర్చిదిద్ది, బహురమణీయమైన పద్ధతిలో ప్రదర్శించుచున్న కళావేత్త

శ్రీవేదాంతం సత్యనారాయణశర్మ. ఈయన ప్రదర్శనంచూసి ముగ్ధులు కాని ప్రేక్షకులుండరు. తన్మయులుగాని రసికజనులరుదు. ఈయన కళాసేవకు మెచ్చి భారత ప్రభుత్వం వీరిని "పద్మశ్రీ" బిరుదుతో గౌరవించారు. ఢిల్లీ అకాడమీవారు "ఫెలోషిప్పు"నిచ్చి సత్కరించారు. శ్రీ సత్యనారాయణశర్మను ఒక ఉత్తమ కళాకారునిగా తీర్చిదిద్దిన వారు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు. వారు కీ॥ శే॥ చింతా వేంకట్రామయ్యగారి పుత్రులు. కృష్ణమూర్తిగారు సహృదయుడైన నాట్యాచార్యుడు కూచిపూడి భాగవత కళారీతి ప్రచారానికి నిరంతరము కృషిచేసిన ఉత్తమ కళావేత్త. వీరిని సంగీత నాటక అకాడమీ వారు "భరతకళాప్రపూర్ణ" బిరుదునిచ్చి గౌరవించారు.

కూచిపూడి నర్తనమును మద్రాసు రాష్ట్రములో ప్రచారము చేయుచున్నవారు వెంపటి చిన్నసత్యం, యం. యన్. శైవగారు చిన్నసత్యంగారు ఎందరినో ఈ కళలో తయారుచేశారు. ఎందరో ప్రముఖ సినిమా కళాకారిణులు వీరివద్ద కూచిపూడికళ నభ్యసించారు. శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారు చలనచిత్ర రంగంలో స్థిరపడిపోయారు. శ్రీ పసుమర్తి వేణుగోపాలకృష్ణమూర్తి కూచిపూడిలోని సిద్ధేంద్ర కళాక్షేత్రానికి ప్రధానాచార్యులుగా కళాసేవ చేస్తున్నారు.

శ్రీ సి. ఆర్. ఆచారిగారు అహ్మదాబాదులో "దర్పణ" నర్తనాలయంలో కూచిపూడి అధ్యాపకులుగాఉండి గుజరాత్‌లో ఈ ఈ కళను ప్రచారము చేయుచున్నారు.

ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నగరంలో కూచిపూడి కళాశాలలు నెలకొల్పి తద్వారా ఆ కళను ప్రచారములోనికి తేవడానికి కృషి సల్పుతున్న కళాకారులు శ్రీ భాగవతుల రామకోటయ్య, శ్రీ వేదాంతం జగన్నాథశర్మ, శ్రీమతి సుమతీకౌశల్ గార్లు. శ్రీరామకోటయ్యగారు సంగీత నాటక అకాడమీ స్థాపించిన కూచిపూడి గురు

కులానికి గురుకులాధిపతి. శ్రీ జగన్నాథశర్మగారు ప్రముఖ నాట్యాచార్యులు, బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారి పుత్రులు.

ఆంధ్రజాలరు సంపత్‌కుమార్—శాస్త్రీయ నృత్యమును జానపద కళాభరణములతో అలంకరించి, పండిత పామర జనరంజకంగా తీర్చిదిద్ది నృత్యకళను ప్రచారను చేయుచున్నారు. జాలరు నృత్యము ఆయన యొక్క విశిష్టత. ఈ నర్తనము విదేశ కళాకారులను సహితము సమ్మోహితులను చేసినది.

శ్రీ బి. వి. నరసింహారావు విద్యావేత్త, కవి, బాలసాహిత్యమందు విశేష కృషి సల్పిన నాట్యాచార్యుడు, నర్తకుడు. భావ కవితకు నృత్యభంగిమలను గూర్చి ప్రదర్శనలిచ్చి ప్రాచీన నృత్యకళకు నూతన శోభ చేకూర్చినవాడు. ఆయనవద్ద తయారయిన శ్రీ పి.వి. నరసింహారావు, శ్రీ బి.ఆర్. మోహనరావు అను నాట్యాచార్యులు విశాఖపట్నంలో నృత్య కళాశాలలు నడుపుతున్నారు.

యువతరం కళాకారిణులలో సుమారు ఇరవై సంవత్సరాలుగా నృత్యానికి, తన జీవితాన్ని అంకితంచేసి, కూచిపూడి, భరత నాట్య రీతుల నభ్యసించి దక్షిణ భారతమంతటా ప్రదర్శనలిచ్చి పండితుల ప్రశంసలనందిన శ్రీమతి కనకదుర్గ ప్రస్తుతం, విజయవాడ గవర్నమెంటు సంగీత కాలేజీలో నృత్యకళా ప్రొఫెసర్‌గా పనిచేయుచున్నారు.

శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ, శ్రీ గుడిమెట్ల కృష్ణగారలు ఏలూరులో కూచిపూడి కళాక్షేత్రములను నడుపుతున్నారు.

పద్మశ్రీ యామినీ కృష్ణమూర్తి తెనుగు నాట్యం ప్రపంచంలోని వివిధ దేశాలలో ప్రచారం చేస్తున్న నర్తకీమణి. తండ్రి కృష్ణ

మూర్తిగారి నృత్యకళపై వ్యాఖ్యానంతో దేశమంతటా ప్రదర్శనల నిచ్చి పండితుల ప్రశంసలనందిన కళాకారిణి.

శ్రీ చరకా సత్యనారాయణ హైదరాబాదుకు చెందిన యువ కళాకారుడు. కథక్ నర్తనం గవర్నమెంటు కాలేజీలో అభ్యసించి, ఢిల్లీలో కోరియోగ్రఫీ నాట్య విద్యాలయంలో శ్రీమతి మాయా రావువద్ద శిక్షణ పొందినవాడు. జపాన్ దేశంలో బెలె నర్తకులకు భారతీయ నర్తనమును నేర్పి, ప్రదర్శనములు ఇప్పించిన తొలి తెనుగు కళాకారుడు.

కుమారి స్వప్నసుందరి, నాట్యదంపతులు రాజారెడ్డి రాధారెడ్డి కూచిపూడి నృత్యం అభ్యసించి పలుచోట్ల ప్రదర్శనముల నిచ్చుచున్నారు.

శ్రీమతులు వింజమూరి సీత, అనసూయగార్ల నెరుగని తెలుగు కళాలోకముండదు. తెనుగు దేశంలోని జానపద సంగీతాన్ని ప్రత్యేకంగా అభ్యసించి ప్రచారం చేసిన సంగీత కళాభిజ్ఞలు. శ్రీమతి అనసూయ గారి కుమార్తె రత్నపాప కూచిపూడి నర్తనము నభ్యసించి ప్రచారం చేయుచున్న విద్యావంతురాలు.

శ్రీ గోపాలరాజు భట్టుగారు తెనుగు దేశములోని అనేక జానపద నర్తన రీతులను ప్రచారములోనికి తేవడానికి బహుకాలంగా కృషి సల్పుతున్నారు. ఎందరో విద్యార్థులను ఈ కళలో తర్ఫీదు చేశారు. ప్రస్తుతం హైదరాబాదు, ప్రభుత్వ సంగీత కళాశాలలో జానపద నృత్య కళ అధ్యాపకులుగా ఉన్నారు.

సుమారు 12 సంవత్సరాల క్రిందట ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు అఖిల భారత నృత్యోత్సవాలు హైదరాబాదులో జరిపినారు. తద్వారా, భారత దేశములోని వివిధ ప్రాంతాల

గారి ఆర్థిక సహాయంతో, రాజమండ్రిలో ఈ కళారీతికి ఒక పాఠ్య క్రమమును ఏర్పాటు చేయాలనే ఉద్దేశంతో సిలబసు కమిటీ సమావేశమైంది. ఆంధ్ర దేశంలోని వివిధ జిల్లాలు, శ్రీకాకుళం, విశాఖ, తూర్పు పశ్చిమ గోదావరి, కృష్ణ, నెల్లూరు, కడప, కర్నూలు, మహబూబునగరు, మెదకు జిల్లాల నుండి ప్రముఖులైన స్త్రీ కళావేత్తలు రాజమండ్రి నవభారత గురుకులంలో సమావేశమై, లాస్య సంప్రదాయానికి సిలబసు రూపొందించారు. ఆ సిలబసు ననుసరించి సంగీత కళాశాల లందు శిక్షణ ఇచ్చినప్పుడు ప్రాచీన కాలంనుండే ఆంధ్రలో అభివృద్ధి గాంచి ప్రచారంలో ఉండిన భరత నాట్యం మరల విరివిగా ప్రచారమయ్యే అవకాశ మేర్పడును.

ఇంతయేగాక తెనుగునాడులో విలసిల్లిన యక్షగాన, వీధి భాగవత, చర్మనాటక సంప్రదాయములు; జానపద, గిరిజన కళలు అభివృద్ధి పరచాలనే ఆశయంతో మొదటిసారిగా అఖిలాంధ్ర జానపద కళలు ఉత్సవాలు సంగీత నాటక అకాడమీవారు జరిపించారు శ్రీకాకుళం, వైజాగ్ జిల్లాలందు ప్రచారంలోనున్న ప్రాచీన ద్రుపద సంప్రదాయ భాగవత కళాకారుల సదస్సు జరిపించారు. ఈ కళారూపాల అభివృద్ధికి, ప్రచారానికి ఆర్థిక సహాయం లభింపజేశారు.

నాట్యశాస్త్రములను తెనుగులోనికి అనువదించి కళాలోకానికి అందించిన కొందరు ప్రముఖులుగా భరతుని నాట్యశాస్త్రమును సుచ్ఛమైన తెనుగులో అందరికీ అర్థమయ్యే శైలిలో అనువదించిన వారు డాక్టర్ పి.యస్.ఆర్. అప్పారావుగారు. వీరు నాటక కళాచరిత్రను గూడా రచించినారు. శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు మహామహోపాధ్యాయులు. అనేక సంస్కృత గ్రంథములు తెనుగు జేసినారు. భరతుని నాట్యశాస్త్రము, జాయసేనాపతి 'నృత్త రత్నావళి, అనువదించారు. శాస్త్రము, సంప్రదాయము నెరిగిన కళా

వేత్త కీ॥ శే॥ లంకా సూర్యనారాయణ భరతనాట్యమును శ్రీ సిద్ధ బత్తుని రాఘవయ్యగారివద్ద అభ్యసించారు. చంద్రశేఖర కవి రచించిన భరత సారసంగ్రహమును, సంగీత రత్నాకరమును తెనుగు జేసినారు. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, సంగీత కళానిధి 'గానకళాప్రపూర్ణ' బిరుదాంకితులు. వీరు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారి కోర్కెపై జాయసేనాని 'నృత్తరత్నావళి' తెనుగించినారు.

పుచ్చా సుబ్రమణ్యశాస్త్రిగారు సంగీత శాస్త్రములందు బహుకాలంగా పరిశోధన సల్పి అనేక గ్రంథములు రచన చేసినారు.

ఆచార్య పోతుకూచి సుబ్రమణ్యశాస్త్రి (నాగపూరు) గారు నాట్యశాస్త్రమును సులభశైలిలో తెనిగించినారు.

ప్రఖ్యాత దేశభక్తుడు, కళాభిమాని శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు, ఆనంద్ కె. కుమ్మారస్వామితో కలిసి నందికేశుని అభినయ దర్పణమును ఇంగ్లీషులోనికి అనువదించారు ఆ గ్రంథము ప్రపంచమంతటా ప్రసిద్ధిగాంచినది.

చెర్విరాల భాగయ్యకవి పేరువినని, వారి యక్షగానములు పాడి ఆడనటువంటి బహురూపులు, భాగవతులు, భరతులు తెలంగాణా ప్రాంతములో ఉండరనిన అతిశయోక్తిగాదు. శతాధిక గ్రంథ కర్త. భారతభాగవత రామాయణాది పురాణేతిహాసములందలికథలను యక్షగాన, వీధి నాటకములుగా రచనజేసి కళాలోకాని కందించిన కవి పుంగవుడు.

వీధి నాటక, యక్షగానములందు ప్రాచీన సంప్రదాయమ్ము నను సరించి ఉపయోగించే చెక్కతో ఆభరణములను తయారుచేయు పని వారు. తెలంగాణా ప్రాంతంలో కరీంనగర్ జిల్లాలోనూ, రాయలసీమ చిత్తూరు జిల్లాయందును, సాగరసీమలో శ్రీకాకుళం జిల్లాయందును

ఉన్నారు. ఈ ప్రాంతంలోని భాగవతులు నేటికీ ఆ ఆభరణాదులనే ఉపయోగించుచున్నారు.

ఇన్ని రీతుల తెనుగు దేశంలోని కళాభివృద్ధికి కళాకారులు, సంగీత నాటక అకాడమీ, ప్రభుత్వం కృషిసల్పుచున్ననూ మనదేశంలో ఒక క్రమపద్ధతిని కళలు అభివృద్ధి చెందవలసిన అవసరం యెంతైనా ఉంది. దానికిగాను శాస్త్రము, సంప్రదాయము సక్రమ పద్ధతిలో అభ్యసించిన నాట్యాచార్యులు ప్రస్తుతం చాలా అవసరము. లేనిచో కళలకు భవిష్యత్ ఉండదు. ప్రభుత్వము వారు నాట్యాచార్యుల శిక్షణకు ఒక ప్రత్యేక కళాశాల నేర్పాటుచేసి అందుమన ప్రాచీన రీతుల నెరిగిన పెద్దలను రప్పించి యువతరం వారికి శిక్షణ నిప్పించి, అట్లు తయారు అయిన నాట్యాచార్యుల ద్వారా ప్రతిజిల్లాలో కళాశాలలు పెట్టించితేగాని, సక్రమ పద్ధతిలో నృత్యకళ పెంపొందదు. ప్రస్తుత కాలంలో ప్రతి తల్లి తండ్రి తమ బిడ్డలకు నృత్యకళ నేర్పించాలనే ఉత్సాహము కలిగిఉన్నారు. కాని సుశిక్షితులైన గురువులు తక్కువగా ఉన్నారు. కాస్త నాట్యము వచ్చిన ప్రతివారూ నాట్యాచార్యులై శిక్షణఇస్తున్నారు, వారికి తోచిన రీతిని. దీనివల్ల నాట్య కళాకారులకు ఆర్థికంగా లాభం చేకూరిననూ, కళకు చాలా అపచారము, అపకారము కల్గుతుంది. ఇది దేశంలో కళాభివృద్ధికి ఏ విధంగానూ తోడ్పడదు.

మరొక్క ముఖ్య విషయం. సంఘం మారుతున్నది. పూర్వం వలే ఏ కొద్ది తెగలకు చెందినవారోగాక అందరు ఈ కళను అభ్యాసం చేస్తున్నారు. దేశం ముందుకు పోతున్నది. కాని మన కళలు మాత్రం నేటికి రెండు వందల సంవత్సరాలు వెనుకబడిఉన్నవి. నేటి దేశ, కాల పరిస్థితులు ననుసరించి ప్రాచీన సంప్రదాయాలను, శాస్త్రీయ పద్ధతులను విడనాడకుండా నృత్యకళను నూతన సమాజ అవసరాలకు అను

వైన పద్ధతిలో తీర్చిదిద్దవలసిన అవసరంఎంతయినా ఉంది. అప్పుడే కళలలోకూడా అభ్యుదయాన్ని సాధించగల్గుతాము. పూర్వం ఆలయాధిపతులు, రాజులు ఈ విధంగా కళలను తీర్చిదిద్ది ప్రచారముచేయుటకు అన్ని విధాలా అవకాశాలు కల్పించేవారు. పండితులు, నృత్యకళావేత్తలు నాట్యాచార్యులు, నర్తక నర్తకీజనము, అందరూ ఒకచోట సమావేశమై కళా సంప్రదాయాలను తీర్చిదిద్దుచుండెడివారు. అట్లు రూపొందినట్టివే ఆస్థాన కేళికా రూపాలు, భాగవత పద్ధతి. అట్టిది నేటి మన కళల అభివృద్ధికి ఎంతో అవుసరము. మన ప్రభుత్వం ఈ కార్యాన్ని చేపట్టిననాడే మన నృత్యకళారీతులు అభ్యుదయ పథాన ప్రభవించగలవు.

మనది అనగానే యెందుకోగాని చిన్నచూపు చూచే అలవాటు తెనుగు దేశంలోని పెద్దలలో చాలా మందిలో ఉన్నది. అందువల్లనే మన రాష్ట్రంలో నృత్య సంగీత కళలను అభివృద్ధి పరుచుటకు ఏర్పడిన సంగీత సభలు, కళా సంస్థలవల్ల బహుకొద్ది సహాయ సహకారాలు తెనుగు కళాకారులకు లభించుచున్నవి. మనవారిని మనమే చులకనగా జూచిన యితర ప్రాంతములవారు గౌరవించుటకల్ల, ఆదరించుట అసలే ఉండదు. మన కళల యొక్క విశిష్టత, విజ్ఞానాన్ని గూర్చి ప్రజలలో విరివిగా ప్రచారము జరిగిననాడే ఈ అపోహాలు తొలగి, మన కళలు ఆదరింపబడే అవకాశం కల్గుతుంది. దీనికి కేవలము సభా వేదికల నుండి ఉపన్యాసములిచ్చే ఉపన్యాసకులు, కేవలము ప్రదర్శనము లిచ్చుటతో సంతృప్తి జెందే నర్తలుగాక — గురు ముఖంగా శాస్త్రము సంప్రదాయము నభ్యసించి, తాము స్వయంగా ఆడి పాడి అభినయించి మన కళల యొక్క విశిష్టతను నేటి నాగరికులలో ప్రచారము చేయ కల్గిన, శక్తివంతులైన, విద్యావంతులైన యువ ప్రచారకులు కావాలి. ప్రాచీన కాలమునుండి అట్టి త్యాగ ధనులు దేశంలో ఉండుటచేతనే, మన కళల ద్వారా మన సంస్కృతి, సామాన్య ప్రజానీకంలో

ప్రబోధం గాంచినది నేడు అట్టి వారు కరువయ్యారు. అట్టి వారు కొందరయినా తయారయినగాని, మన కళలకు భవిష్యత్ ఉండదు. ఈ విషయంలో ప్రభుత్వం పాత్ర బహు స్వల్పము. ప్రతి కళాకారుడు తాను ఆరాధించే కళ యొక్క విశిష్టతను కొంతకాలమైనా దేశంలో ప్రజానీకంలో ప్రచారము చేయుటకు కంకణము కట్టుకోవాలి. మన ప్రాచీన కళల విశిష్టతను లోకానికి యెరుక చేయుట తన విధ్యుక్త ధర్మముగా నెంచాలి. ప్రతి కళావేత్త ఒక కళా తపస్వి అయినగాని నాడువలె నేడు మన కళలు మహోన్నత శిఖరాల నందుకో జాలవు.

"భరత కళా ప్రపూర్ణ"

# శ్రీ నటరాజ రామకృష్ణగారి రచనలు

1. నృత్యాంజలి
2. నృత్య రేఖ
3. నృత్య మంజరి
4. నృత్య జ్యోతి
5. నర్తన బాల
6. నర్తన శోభ
7. నర్తన సీమ
8. నర్తన భూమి
9. నర్తన మురళి
10. నర్తన పూజ
11. నర్తన కథ
12. నర్తన వాణి

13. నాట్య రాణి
14. నాట్య జ్యోతి
15. నాట్య సుందరి
16. ఆంధ్రుల నాట్యకళ
17. దేవ నర్తకి – ఆలయ నృత్యాలు
18. క్షేత్రయ్య పదములు – అభినయము
19. దాక్షిణాత్యుల నాట్య కళాచరిత్ర
20. మన నృత్యకళ
21. రదనిక
22. లకుమ
23. పసిడి మువ్వలు – పారాణి
24. ఆంధ్రులు
25. నర్తన రీతులు
26. డ్యాన్సింగ్ బెల్స్ (ఇంగ్లీషు)
27. తూ. గో. జిల్లాలో నృత్యకళ
28. ప. గో. జిల్లాలో నృత్యకళ
29. తెనుగునాడు–నృత్యకళ

**భారత ప్రభుత్వ ప్రథమ బహుమతుల నందుకొన్నవి**

1. నర్తనబాల
2. డ్యాన్సింగ్ బెల్స్ (ఇంగ్లీషు)

3 నర్తన సీమ

4. నర్తన భూమి

5. దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర

6. నర్తన కథ

**అచ్చులోనున్న గ్రంథం: ఆంధ్రులు-నాట్యకళ**

20 సంవత్సరముల పరిశోధన గ్రంథము—5 భాగములు, 2500 పేజీలు—1500 ఛాయా చిత్రములు, త్రివర్ణ చిత్రములతో-ఆంధ్రుల నృత్యకళా చరిత్రను తెల్పే అపూర్వ గ్రంథము.

వివరాలకు :

**నటరాజ రామకృష్ణ**

నృత్యనికేతనం, హైదరాబాద్-500020.